శ్రీరస్తు

# కపిరగిరి చరిత్రము

## ప్రసన్నాంజనేయ ప్రభావము

### ప్రథమాశ్వాసము

చ. వెలయఁగ వేయిశీర్షములు వేయిపదంబులు వేయికన్నులున్
గలిగి విరాట్స్వరూపము జగంబుల నించి సృజించి పెంచుచున్
విలయ మొనర్చుచున్ వెలుఁగువేల్పు నిరంజన నిర్వికల్ప ని
శ్చల నిరుపద్రవాఖ్యల నెసంగెడుదేవుఁడు మమ్ముఁ బ్రోచుతన్ 1

### అవతారిక

వ. అని పరమవిరాడ్విగ్రహప్రార్థనంబు గావించి నేనొక్క నూతనప్రబంధంబు సేయ నెంచి శాలివాహనశకవర్షంబు లీలాద్రీభ చంద్రులం బొందియున్న విరోధి సంవత్సర వైశాఖశుక్లపక్షైకాదశీదినంబున శ్రీమదన్నవరసత్యనారాయణస్వామిన్ సేవించి యటనుండి యూష్మశకటం బధిష్ఠించి తునిపురముమీఁదుగా మహాబలిఘట్టమ్మునకు సమీపమున నున్నసీతారామపురాగ్రహారంబునకు నవధానులవేంకటరామయ్యాఖ్యునిం గూడి పోయితి నదియును. 2

సీ. బ్రహ్మలింగేశ్వరవామదృష్టిప్రసా
రమున కేయూరు పాత్రత వహించుఁ
గపిలానదీజలక్షాళితాఘం బయి
యేయూరు పుణ్యాఢ్యమై యెసంగుఁ
బ్రాగ్గతసంజీవిపర్వతంబుననుండి
యుదితార్కుఁ డక్షత్తి యొరయుఁ దేని

బరమపవిత్రమై పరఁగుపురుషమృగ
మేపురంబునఁ దొల్లి యేపుమీఱుఁ

తే. గపిరగిరిపాదకలితభాగప్రశస్త
వసుధయై యంటుమామిళ్లు పనసచెట్లు
జీడిమామిళ్లు గల దయి సీతపేర
రాముపేర నాపురము వర్ణ్యంబ యగును. 3

ఉ. అందుఁ ద్రిలింగదేశభవులై వివిధాధ్వరకర్మదక్షులై
యెందఱో వైదికోత్తము లహీనకళాకలితప్రభావులై
యుందురు మావితోవుల సమున్నతబాలమరుత్ప్రసంగతిన్
బొందుచు నెట్టిరోగములఁ బొంతకుఁ జేరఁగ నీనిశక్తిమై. 4

చ. ఘనుఁడు కుమారదేవ మనుగ్రామమునన్ మునుఁ బొల్చువాఁడు స
జ్జనుఁడును వేదశాస్త్రవిలసన్మతి మిత్ప్రియమిత్రుఁ డిక్కృతిన్
బొనరుప నిష్టతం దెలిపె ము న్నవధానుల రామసుబ్బరా
డ్జనసుతనాముఁ డవ్వోట నెసంగుఁ గుటుంబముతోడ మేటియై. 5

ఉ. మేడలు మిద్దెలున్ మఱియు మేలిమికట్టడముల్ హజారముల్
వేడుకలు న్విలాసములు పేటలు నీటులు లేక పోయినన్
మూడుగు లాఁకటిండ్ల యయి మానసవీథి హరించువీథులన్
గూడినతోవులై కరకగున్నలు కొమ్మల నేల నాటుచున్. 6

శా. గంగాస్నానము చేసి మాని శుచియై కాయంబు చే నంటుచున్
బొంగం బాఱెడుబుద్ధి నావయువతప్పాల్ వోయె నం చెంచుచున్
బంగారంబున కెత్తు నే ననుచు సుస్వాంతంబునం బొల్చున
భ్భంగిన్ దత్పురి కేగి మర్త్యుఁడు తలంపం బోవు స్వాచ్ఛత్వమున్.

తే. ప్రకృతిచే రామణీయక మకలుషమును
పూతవాయుసమేతము పూతిగంధ
రహిత మాయూరు శాంతికిఁ బ్రథమపదము
కాపురంబున కొప్పెడు  8

వ. అప్పురంబున నాకుఁ బరమమిత్రుండును బొక్కసూరికులపవిత్రుం
డును సుబ్బరాయార్యపుత్రుండు నగు వేంకటశాస్త్రి యనునుత్తమ
బ్రాహ్మణుండు సపుత్రమిత్రకళత్రంబుగా నివాసం బుండువాఁ డతండు
నన్నుఁ బ్రేమించి నాయం దాత్మభావము చేయుచుండు వాఁడు. 9

ఉ. ఆతఁడు కాలధర్మమున కైనపదంపడి వానిపుత్రులుం
జ్ఞాతులు నైనవా రచట సంసృతి సల్పుచు నున్నవారు నా
ప్రీతికిఁ బాత్రిభూతు లయి వేడుక సేయుచుఁ దండ్రిఁ బోలె న
న్నాతతభక్తిఁ గొల్చుచు నిరంతరబంధుత నిర్వహించుచున్. 10

క. నారాకఁ దెలిసి వారలు
దూరంబుగ నెదురువచ్చి తోడ్కొని చని గే
హారామమందు నిలిపి మ
హారంభం బెసఁగఁ గొలిచి రతిభక్తి మెయిన్. 11

వ. ఆరాత్రి భోజనానంతరంబున గృహప్రాంగణంబున వెన్నెలబయల మంచంబుపై నేనును నామిత్రపుత్రులును వారిజ్ఞాతియుఁ బిత్రృతుల్యుండు నగునరసింహశాస్త్రియు మఱి కొందఱునుం గూరుచుండి యిష్టగోష్ఠులం దీర్చుచున్నసమయంబున నవధానుల వేంకటరామశర్మ కపిరగిరివృత్తాంతంబును గపిలానదీప్రభావంబును హనుమదావిర్భావంబునుం జెప్పుచుఁ బ్రసంగవశంబున బలిఘట్టంబునం గల బ్రహ్మలింగేశ్వరమాహాత్మ్యం బభివర్ణించుచుండ నందున్నవారందఱు బలిఘట్టంబు లోనగువిశేషంబు లరయం దగు ననియు రేపు బలిఘట్టంబునకుం బోయివచ్చి పదంపడి కపిరగిర్యాదులం దిలకింత మనిన నేను నట్లయగుంగావుత మని మరునాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబులు నెఱవేర్చుకొని భుజించినపిమ్మట నందఱముం గలసి యనడ్వాహశకటంబు లెక్కి చని బ్రహ్మలింగాదిదర్శనంబును నామఱు

వ. అప్పురంబున నాకుఁ బరమమిత్రుండును బొక్కనూరికులపవిత్రుం
డును సుబ్బరాయార్యపుత్రుండు నగు వేంకటశాస్త్రి యనునుత్తమ
బ్రాహ్మణుండు సపుత్రమిత్రకళత్రంబుగా నివాసం బుండువాఁ డతండు
నన్నుఁ బ్రేమించి నాయం దాత్మభావము చేయుచుండు వాఁడు. 9

ఉ. ఆతఁడు కాలధర్మమున కైనపదంపడి వానిపుత్రులున్
జ్ఞాతులు నైనవా రచట సంస్థితి సల్పుచు నున్నవారు నా
ప్రీతికిఁ బాత్రభూతు లయి వేడుకసేయుచుఁ దండ్రిఁ బోలె న
న్నాతతభక్తిఁ గొల్చుచు నిరంతరబంధుత నిర్వహించుచున్. 10

క. నారాకఁ దెలిసి వారలు
దూరంబుగ నెదురువచ్చి తోడ్కొని చని గే
హారామమందు నిలిపి మ
హారంభం బెసఁగఁ గొలిచి రతిభక్తి మెయిన్. 11

వ. ఆరాత్రి భోజనానంతరంబున గృహప్రాంగణంబున వెన్నెలబయల మంచంబుపై నేనును నామిత్రపుత్రులును వారిజ్ఞాతియుఁ బితృతుల్యుండు నగునరసింహశాస్త్రియు మఱి కొందఱును గూరుచుండి యిష్టగోష్ఠులం దీర్చుచున్నసమయంబున నవధానుల వేంకటరామశర్మ కపిరగిరివృత్తాంతంబును గపిలానదీప్రభావంబును హనుమదావిర్భావంబునుం జెప్పుచుఁ బ్రసంగవశంబున బలిఘట్టంబునం గల బ్రహ్మలింగేశ్వరమాహాత్మ్యం బభివర్ణించుచుండ నందున్నవారందఱు బలిఘట్టంబు లోనగువిశేషంబు లరయం దగు ననియు రేపు బలిఘట్టంబునకుం బోయివచ్చి పదంపడి కపిరగిర్యాదులం దిలకింత మనిన నేను నట్లయగుంగావుత మని మరునాఁ డరుణోదయంబున లేచి కాల్యకృత్యంబులు నెఱవేర్చుకొని భుజించినపిమ్మట నందఱముం గలసి యనడ్వాహశకటంబు లెక్కి చని బ్రహ్మలింగాదిదర్శనంబును నామఱునాఁడు కపిరగిర్యాదులునుం గని గృహంబు చేరియున్నప్పుడు. 12

మ. నను వారందఱు తత్ప్రభావమును నానారీతులం దెల్పుచున్
వినుతుల్ సేయుచు నేతదర్థము లిలన్ విఖ్యాతి కెక్కంగ నొ
క్కనవీనం బగుగ్రంథమున్ సలిపి వేడ్కం గూర్పవే మాకు నీ
వనుకొంటల్ తడ వట్లుగాఁ గృతిని జేయం జాలు దోసత్కవీ. 13

క. నీదుననుగ్రహ మనినన్
గాదన కే నట్లు కృతిని గావించి కృతిన్
నాదగుమిత్రుని కిచ్చెద
నాదట సుగతుల్ లభించునటు లాతనికిన్. 14

క. అవధానులవేంకటరా
మవరేణ్యునికోర్కి సెల్ల మన్నించుటయున్
దవురీతి దాని సద్గతు
లవునని మిత్రున కొసంగు టగు నొకదానన్. 15

వ. అని బహుమానపురస్సరంబుగ నంగీకృతిం దెలుపుచు భవిష్యన్మహా
పురాణోక్తక్రమంబున నపూర్వప్రబంధంబు నిర్మింపందలంచి ముందు
మంగళాచరణంబుగా నాపరమమిత్రునివంశావతారం బభివర్ణించెద.

## కృతిపతివంశవర్ణనము.

ఆ. అబ్జభవుని వంశమందు ఘనుఁడు స్వతం
త్రకపి యనెడుఋషి విరాజమానుఁ
డయ్యె నతనిగోత్రమందుఁ బెక్కురు ద్విజు
లుదయ మంది పొక్కునూర నుంట. 17

తే. పొక్కునూరివా రనుపేరఁ బొలుపుమిగిలి
రందుఁ దెలగాణ్యులై కొండ జరిగిన పయి
రామభ ట్టనువిద్వదగ్రసరుఁ డుదయ
మయ్యె మూలపూరుషుఁడై నిజాన్వయమున. 1

సీ. అతనికి నయ్యాభ ట్లనువాఁడు వేంకట
శాస్త్రి నాఁబడువాఁడు జనితు లైరి
వేంకటశాస్త్రికి వెలసె నరసభట్టు
వేంకటశాస్త్రియు వెనుక నయ్యె
సుకృతి నరసభట్టునకుఁ బుత్రకులు వేంక
టావధానియును లచ్చన్న బుచ్చి
రామశాస్త్రియును సూరయ్యయు సుబ్బయ్య
యనఁగ నేవురు పుట్టి రందు సుబ్బ

తే. యకును వేంకటశాస్త్రి సుబ్బన్న నార
సింహశాస్త్రియుఁ బుత్రు లై చెన్నుమీఱి
రందు వేంకటశాస్త్రికి నైరి సుబ్బ
రాయఁడును యజ్ఞనయు సీతరామయ యన. 19

తే. ఘనుఁడు సుబ్బాయుఁ డన్వయమునకు భూష
ణ మయి వేంకటశాస్త్రి యన్ తనయుఁ గనియు
నవలఁ గాంచె సుబ్రహ్మణ్య మనెడువాని
గణపతిఁ గుమారుని శివుండు గాంచినట్లు. 20

మ. స్ర. ఘనుఁ డాసుబ్బాయుఁ డెంతే గణనకు నగుచున్
గ్రామణుల్ మెచ్చ లోకస్యం
బునయందుం బేరు మ్రోయఁగ పొనరిచి మిగులం
బ్రోల్చుసద్వర్తకంబుల్
ధనవంతుండై వివేకాలయుఁడు నయి మహా
లక్ష్మి దేవేరి గాఁగం
గొని యెంతే ఖ్యాతి గాంచెన్ గుణగణనిధియై
కోవిదుల్ మెచ్చనిచ్చల్. 21

క. గంగమకుఁ బుట్టెఁ గావునఁ
బాంగారె నతండు భీష్ముఁ బోలిన మేధా
సంగతి గలఁడై సుబ్రా
య్యాంగజదమనుండు సుజను లగ్గింప నిలన్ 22

ఉ. ఆతని కాత్మజన్ముఁ డయినట్టిఁడుఁ వేంకటశాస్త్రి లోకసం
ప్రీతికరుండు విజ్ఞుఁ డయి వేంకటసుబ్బమఁ బెండ్లియాడి ని
త్యాతతపుణ్యవర్తని విహారము చేయుచు నెప్డు సత్పురా
ణాతిదిదృక్ష ధర్మముల నారయువాఁ డయి కాంచె సద్గతిన్ 23.

తే. అతనికల్ల వేంకటసుబ్బమాంబయందు
సుతులు లక్ష్మినారాయణ సుబ్బరాయు
లనెడునిర్వురు రాముఁడు లక్ష్మణుండు
నాఁగఁ బండితు లెన్నెడునయము గలిగి. 24

వ. మఱియు నిట్లుపుత్రద్వయంబు పుట్టినంత నావేంకటసుబ్బమాంబా వేంకటశాస్త్రిదంపతులకు సామ్రాజ్యలక్ష్మి వీరభద్రమ భాస్కర శాంతమయనుముగ్వురుపుత్రికలు పుట్టిరందు భాస్కరశాంతాదేవిని.

సీ. కాశీనివాసియై ఖ్యాతిఁ గాంచినవాఁడు
విజ్ఞానఖని యయి వెలయువాఁడు
ధర్మశాస్త్రాచార్య తర్కతీర్థ మనీషి
న్యాయమార్తండ వేదాంతచక్రి
వర్తి తర్కమనీషి వరనవన్యాయశా
స్త్రాచార్యవర్య వేదాంతశాస్త్రి
ముఖ్యమహాబిరు దాఖ్యాంచితుం డగు
నానెపువంశవిఖ్యాతుఁ డగుచుఁ

తే. బ్రతిభ గాంచినవేంకటరమణశాస్త్రి
వర్యుఁన కొసంగి తనతోడ వంశ మెల్ల

పూత మగునట్లు చేసె నప్పుణ్యమూర్తి
ఘనుఁడు వేంకటశాస్త్రిసంకల్పమహిమ. 26

సీ. మొదటివేంకటశాస్త్రి పుత్త్రులలో నాది
నరసభట్టునకుఁ బుత్త్రుఁడు వేంక
టావధానికిఁ బ్రకాశావధాని సుతుండు
నాతనికిన్ వేంకటావధాని
పరఁగె నాఘనునకు నరసింహశర్మ యన్
ప్రజ్ఞానిధి జనించెఁ బండితుఁ డయి
యాతనికిన్ సుమిత్రావధానియును సు
బ్రహ్మణ్యమును బుత్త్రరత్నము లయి

తే. రట్టి నరసింహశర్మయం దల్లపాక్క
సూరివేంకటశాస్త్రి యేకోదరుఁ డను
నట్టిభావము చేయుచు నాత్మజులును
దాను సేవించుచుందురు మాన కెపుడు. 27

వ. కృతిపతి యగుమన వేంకటశాస్త్రి పుత్రయుగ్మమున నగ్రజుం డగు లక్ష్మీనారాయణుఁడు వరలక్ష్మీదేవిం బెండ్లియాడి యామెయందు వేంకటశాస్త్రి యనునొక్కకుమారునిం గాంచి మఱియు రుక్మిణి సామ్రాజ్యలక్ష్మి సుబ్బరామాంబ మహాలక్ష్మి యనునల్వురు కుమార్తెలంగాంచె వేంకటశాస్త్రిద్వితీయపుత్రుం డగుసుబ్బరాయుండుచెల్లాయమ్మయను పల్లవాణిం బెండ్లియాడియామెయందు వేంకటశాస్త్రి యనుపుత్త్రులంగనియెనిట్లుపుత్రపౌత్రప్రసక్తిం
బ్రఖ్యాతింగాంచిన శ్రీపాక్కసూరి వేంకటశాస్త్రి మహాశయుండు.

ఉ. ఏ నన నాకవిత్వ మన నెప్పుడు గొప్పగఁ జెప్పుకొంచు స
మ్మానపురస్సరంబుగను మాటల నాడుచు నాప్రబంధముల్
తా నెట కేగ వెంటఁ గొని తద్విషయంబులు విప్పి చెప్పుచున్
జ్ఞానవమూర్తుఁ డన్న నిటు మాటలె గ్రంథము లిన్ని చేయుటల్,

క. దేవాంశభవుఁడు కృష్ణుం
డీవగ భారత మొనర్ప నిట్లు జనించెన్
గావలయు ననుచు మెచ్చెడు
నావలనన్ సంతసంబున నతఁడు కటా. 30

ఉ. భౌతికదేహము న్విడిచి బ్రహ్మపదంబును బొందఁ బోయె నా
నీతివిదుండు నే నిటులు నిల్చితి నిల్చినదానికిన్ ఫలం
బై తనరంగ నొక్కకృతి నాతనికిం బ్రియమొప్పఁ జేసి త
త్పూతతరాత్మకుం గృతిగఁ బోహణచేసెదఁ జిత్తశాంతికై. 31

## కథాప్రారంభము.

వ. అని నిశ్చయించి నాపరమమిత్రునకు శాశ్వతబ్రహ్మలోకనిత్యనివాససిద్ధి యగునట్లు నారచింపఁ బూనిన కపిరగిరిప్రభావం బనుప్రసన్నాంజనేయంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్యపుణ్యక్షేత్రనివాసు లగు శౌనకాదిమహర్షులు హర్షోత్కర్షంబున సమాగతుండైనసూతు నర్చించి తన్ముఖంబున ననేకపురాతనపుణ్యపురాణేతిహాసంబు లాలకించుచు నొక్కనాఁడు కపిరగిరిమాహాత్మ్యంబును బ్రసన్నాంజనేయప్రభావంబును జెప్పు మనిన నతం డిట్లనియె. నట్లు పాండవులు భండనానంతరంబున నొక్క సమయంబున నారదాది దివ్యమునీంద్రులును, ధౌమ్యాదిపురోహితులును, విదురసంజయాది సుముఖులును, కృష్ణాదిబంధుమిత్రులును, బరివేష్టింపం గొలువు దీరి యున్నకాలంబునఁ బాండవాగ్రజుండు రాజసూయంబున సమాగతంబైన పురుషమృగంబు ప్రసక్తిం దెచ్చి కృష్ణాదులు వినుచుండ భీమసేనుం గాంచి యి ట్లనియె. 32

చ. పురుషమృగంబుఁ దెచ్చితి వభూతపరాక్రమవిక్రమంబునన్
భరఁగెదునద్ధి దానివడిఁ బాపెడువాఁడు జగత్త్రయంబునన్

బురుషుఁ డొకండు లేఁడు నిను ముట్టక పట్టక యుండ నెగ్గతిన్
బురమును జేరఁ గల్గితివొ పోలిచిచూడ మహాద్భుతం బగున్. 33

తే. కృష్ణభగవానుఁడే యపు డిందు లేక
యున్న నీప్రాణములె గాక యున్నవారి
యెల్లప్రాణములుం బోవు నే కదన్న
హనుమ మాహాత్మ్యమును జెప్పి తపుడు వింటి. 34

### నారదుఁడు హనుమద్వృత్తాంతము చెప్పుట.

వ. అనిన భీముఁడు హనుమద్గతమానసుండై కనుల నీరువెట్టుకొనుచు
నానందంబున నోడ లెఱుఁగక వెక్కి ళ్ళింగుచుండె నపుడు కృష్ణు
పంపున నారదుండు ధర్మరాజుదిక్కుమొగంబై యిట్లనియె. 35

తే. హనుమకరుణాకటాక్ష మయ్యదనఁ గలిగె
దాన జీవించెఁ గాని యాదారిలోనఁ
బట్టి పురుషమృగము వీనిఁ బొట్టఁ బెట్టు
కొనక పోవునె వెనుక కృష్ణునిది మహిమ. 36

మ. హనుమద్వాలమునీఁది వెంట్రుకలు లో నంఘ్రిద్వయం బుంచువే
శిన చెల్లెన్ గరమం దొకం డయినఁ గల్గం బోదు తత్కాలమం
దు నెఱిం బట్టెను వీనిహస్త మది యాత్రొక్కాటలో దానికిం
గనరాఁగన్ భగవానుఁ డీహరి, కరగ్రాహంబు వో నంతటన్. 37

క. చేతులు మోడిచి హరికిన్
బ్రాతర్వందన మొనర్చి ప్రార్థించె మృగం
బాతఱి జరిగినదంతయు
నీతోయము వా రెఱింగియే యుండ్రు కదే. 38

తే. అన యుధిష్ఠిరుఁ డనియె నోయనఘమూర్తి
తోకవెండ్రుక లవి చెల్లె వీక వచ్చె
నంటి వది యేమి వృత్తాంత మంతయు నిపు
డాలకింపఁగఁ జెప్పవే యందఱకును. 39

వ. అనిన నారదుండు యుధిష్ఠిరా ! సౌగంధికహరణార్థంబు మీతమ్ముఁడు గంధమాదనంబునకుం బోవుట లీరెఱుంగుదురుకదా ! భీమసేనుండు భామినీమనోరథంబు దీర్ప నీయాజ్ఞం గొని పయనంబై పోవుచు నమ్మార్గమధ్యంబున. 40

చ. చల్లనిమందమారుతము సౌరభముల్ వెదజల్లుచుల్ బోలం
బెల్లెడఁ దానయై కలయ నేచుచు వచ్చి పథిశ్రమంబు వో
నల్లనఁ దాఁకుదెంచుటయు నాతఁడు దానికి సంతసిల్లుచున్
మెల్లన మెట్టుచుల్ జనె వనిం గలవింతల నెల్లఁ జూచుచుల్. 41

వ. ఇట్లయ్యరణ్యంబునఁ జరించుచు భీమసేనుఁడు ముందర బహుయోజనవిస్తృతం బయినకదళీషండం బొండు గని తన్మధ్యంబునఁ బద్మరాగప్రభాభాసమానంబగునొక్కకపిలగిరిం గని నీరువట్టున దానిచుట్టుం దిరుగుచు నొక్కచో జలపక్షులసంచారంబునం జేసి నీటియిక్కుం గని కృతావగాహుండై జలంబులం ద్రావి వెలివచ్చి మహోత్సాహంబున విశృంఖలగతివిహరించుచు నొక్కపాదపప్రాంతంబున నిలిచి సర్వప్రాణంబునం జేసి శంఖంబు పూరించుటయును. 42

భీముఁ డాంజనేయుం జూచి సంభాషించుట.

శా. దానం జేసి భయంకరం బగుచు శబ్దం బెంతయే నుద్భవం
బై నానాగిరిగహ్వరంబుల వడిన్ వ్యాపించి హోర్మించు ధా
త్రీనాకంబుల నిండి మెండుకొనుచుం దిగ్దేశముల్ మ్రోసె నా
ధ్వానం బొప్పగ నాలకించి హనుమన్నాముండు తత్రత్యుఁడై. 43

మ. తనతోఁబుట్టువు భీమసేనుఁ డని చిత్తంబందు వాతాత్మజుం
డనఘుం డాతఁడు నిశ్చయించి యతనిల్ హర్షంబునం జూచుని
చ్ఛ నొకండై చనుమార్గ మడ్డి కదళీషండంబులం బండి యుం
డెను నిద్రించెడునట్లు పుచ్ఛ మది క్షోణిం గొట్టి గుర్వెట్టుచున్. 44

వ. భీమసేనుండును జని చని కదళీవనమధ్యంబునం దొక్కవిశాలశిలాతలంబున, 45

తే. బలసి హ్రస్వ మైనగళంబు బాహులతలఁ
గట్టుకొని స్కంధభూయిష్ఠకాయము నిరు
పేద నడుమును గడుపొట్టిపెదవు లదరఁ
బాదలువాఁ డొక్కవానరపుంగవుండు. 46

మ. అచలం బో యన నేకమార్గమున కడ్డై వేఁడివె ల్గట్టు వె
ల్గుచు నిద్రించెడువానరో త్తముని నిక్కుంతీతనూజుండు గాం
చి చలద్బాహుఁడు సింహసంహననుఁడై చేసెన్ మహోగ్రంబుగాఁ
బ్రచురప్రక్రియ సింహనాదము దిశాభాగంబు లల్లాడఁగన్. 47

సీ. హనుమంతుఁ డాశబ్దమున నల్ల నల్లమే
ల్కాని కన్నుఁ గవ విచ్చి కోపదృష్టిఁ
గని భీమసేను ని ట్లనియె నేమయ్య నన్
సుఖసుప్తు లేపితి సొంపు విడిచి
మముఁబోఁటిమృగము లేక్రమమున మెలఁగినఁ
దగుఁ గాని నీ కిట్లు తగునటయ్య
బుద్ధిసంపన్నులై పుట్టినమానవుల్
మది భూతదయ గల్గి మసలుచుంద్రు
తే. కొండికవు నీవు పెద్దలఁ గొలిచి ధర్మ
మును గ్రహించి యెఱుంగవో పురుషమూర్తి
నీ వెవండవు నరులకుఁ బోవరాని
పదము లివి యేటి కైతివో పలుకు మయ్య. 48

వ. అమృతకల్పంబు లైనయీఫలంబులు భక్షించి మగిడి పొమ్ము
చెడక నావచనమ్ము చేకొమ్మని ప్రబోధించిన భీమసేనుండు వాని
కి ట్లనియె. 49

ఉ. ఈ వెవ రీప్లవంగతను వేటికిఁ దాల్చితి క్షత్రియుండ నే
నావరకౌరవాన్వయమునందుఁ బృథాసతికిన్ సదాగతి

శ్రీవలనన్ జనించితి ధరిత్రిఁ గపీంద్ర! వృకోదరాఖ్యకున్
దావల మైతి నావుడును నవ్వుచు నవ్వనచారి యి ట్లనున్. 50

ఆ. వానరుండ నేను వాయునందన ! నీకు
నెడఁగఁ దొలఁగి మార్గ మిడఁగ నోప
నను దొలంచి చనుము నావలనన్ హాని
గలుగఁ బోదు నీకుఁ దెలిసికొనుము. 51

ఆ. అనిన భీమసేనుఁ డనియె నైశస మగు
నను చుఁ దలఁచి యడుగ నయ్యా యిష్ట
మేని లేచి మార్గ మిమ్ము నావలన నీ
కును బాసంగఁ బోదు ఘనతరార్తి. 52

చ. అనవుడు నంజనీతనయుఁ డాతని కి ట్లను నోయివాయునం
దన! ఘనరోగపీడితుఁడ నా కిసుమంతయు లేచుశక్తి లే
దని వచియింతు నీకరుగునట్టిద యైనను నన్ను దాఁటి పొ
మ్మనుటయు భీమసేనుఁడు నయం బలరారఁగ వాని కిట్లనున్. 53

తే. నిర్గుణుం డగుపరమాత్మ నిన్నుఁబోలి
కాయమును దాల్చి జ్ఞానవిజ్ఞేయుఁ డగుచు
నుండు వానికి నవమాన మొందు గాఁగ
దాటిపోఁ జాలఁ గాకున్న మేఁటి నగుచు, 54

క. విను నిన్ను నీగిరీంద్రముఁ
గనుచుండగ నింతలోన ఘనజవనమునన్
గొని దాఁటి పోవ నోపనె
మును హనుమంతుఁడు మహాసముద్రముఁ బోలెన్. 55

తే. అనుడు హనుమంతుఁ డేటికి వనధి దాఁటె
నీ వెఱుంగుదువే నాకు నెఱుఁగఁ జెప్పు
మన వృకోదరు డతఁడు మాయన్న బలస
మన్వితుం డని వింటి 'రామాయణమున. 56

తే. ఏను నాయన్న కెనవత్తు నిద్ధతేజ
మునఁ బరాక్రమమున నిన్ను మొత్త శక్తి
గలదు చూడుము లెమ్ము మార్గ మ్మొసంగు
మురక చెడకుము నానుడి సరకుగొనుము. 57

వ. అని భుజబలదర్పితుండు శౌర్యోన్మత్తుండు నై పలికిన భీమసేనున కలుగ
కంజనీనందనుండు లోలోన నవ్వి యవ్వాయునందనున కిట్లనియె. 58

చ. ముదుసలివాఁడ లేచి యొకపాంతఁ జన న్మొయి శక్తి లేదు నా
కెదఁ గరుణించి నాదయినయీచిఱుతోఁకను బాయఁ ద్రోచి త
త్పదమునఁ బొమ్ము నావుడును బావని వానిని హీనసత్త్వుఁగా
మదిఁ దలపోసి పోసి మదమత్తత నత్తఱిఁ గ్రూరచిత్తుఁడై 59

శా. లాంగూలమ్మునఁ బట్టి కొట్టెఁ జముఁ గొల్వం బుత్తునం చెంచి గో
లాంగూలేశ్వరు మెచ్చ కిచ్చఁ బెరకేలం బట్టి లీలాగతిన్
జెంగం జేయఁగఁ బోయి చాల కవలం జేవోయియుం జేర్చి పూ
న్కిం గైకొంచు నొకింతయుఁ గదలుపన్ లే కమ్మహాపుచ్ఛమున్.

## ఆంజనేయుఁడు నిజరూప మెఱింగించుట

ఆ. మ్రొగ్గతిల్లఁబడియుఁ బొడవడఁగి యతండు
స్విన్నగాత్రుఁ డగుచు ఖిన్నుఁ డగుచు
నూర్పుగములు పుట్ట నోదిగి గర్వము దిగఁ
ద్రావి హనుమ కనియెఁ బ్రాంజలి యయి. 61

చ. తెలియక తప్పు చేసితిని దేవరకు నను సైఁచి ప్రోవఁ గా
వలయుఁ బ్రసన్నచిత్తమున వానరరూపముఁ దాల్చినట్టిపే
విలపయి మెట్టుసిద్ధుఁడవో బుద్ధిఁ దలిర్చెడుగుహ్యకుండవో
తెలుప నమగ్రహింపు మరితిన్ భజియించెద శిష్యుఁడుం బలెన్. 62

తద్వచోజ అనివ సంతస మంది హనుమంతుఁ డిట్టు
లనియె నన్నెఱుంగ లో నభిలషింతేని

వినుము చెప్పెద నేను విశ్వవిఖ్యాతి
వెలయు కేసరిపత్నివిమలగర్భమున
ననిలాంశమున బుట్టి యఖిలజగంబు
లందు హనూమంతుఁ డనుపేరు గాంచి
ఘనుఁ డగుసుగ్రీవుకడ మైత్రి వడసి
కాలంబు గడపినకపివంశజుండ. 63

వ. శ్రీరామచంద్రుఁడు పదునాల్గుసంవత్సరంబు లరణ్యంబులం గడపి మరలి సతితో సాకేతంబునకు వచ్చి పట్టభద్రుండై. 64

తే. తన యశంబు జగంబునఁ దనరుచుండు
నంతదాఁకను నా కాయు వలరునట్లు
వర మొసంగి మహాత్ముఁడు పదునొకండు
వేలవర్షము లిల యేలి వెనుకఁ జనియె. 65

వ. అది మొదలుగా నేను దేవగంధర్వవిద్యాధరసేవితుండనై వారు గానంబునం బ్రసాదించిన శ్రీరామచరిత్రామృతం బారఁ గ్రోలుచు నిట నుంటి నిది మర్త్యుల కగమ్యం బగు దేవమార్గం బిందుఁ జను చున్నని న్నెవ్వరు ధర్షింతురో యని నీమార్గం బిట్టు లరికట్టి చూప ట్టితి ననిన భీమసేనుండు ప్రహృష్టమానసుండై హనుమానునకు సాష్టాంగనమస్కారం బాచరించి యి ట్లనియె. 66

ఉ. ధన్యుఁడ నైతి నీదయినదర్శన మబ్బుటఁజేసి యోజగ
న్మాన్య కృతార్థుఁడఁ జగతి నాసరివాఁ డొకరుండు లేడు నే
నన్యవరంబు వేఁడుకొన నైన సముద్రము దాటునాఁట నే
దైన్యముఁ బొంద కె ట్లగునొ తావకరూపముఁ జూడ నెంచితిన్. 67

వ. అనిన హనుమంతుండు భీమసేనునకు నిజరూపంబు చూపి ప్రసన్నుండై మీకు నవలికాలంబున దాయతోడం బోరు రా నున్న దక్కాలంబున నేను మీతమ్ముని స్యందనంబునందలి సిడంబునం దుండి మీకుజయం బాపాదింతు నింక నీవు జాగరూకుండవై మెలంగి

సౌగంధికంబులం గొని పో మ్మందును సాహసింపకు మని బోధించి యంపిపుచ్చి తాను దిరోహితుం డయ్యె భీమసేనుండును గృతకృత్యుం డయ్యె నింక పురుషమృగవృత్తాంతము చెప్పెద నాలకింపుఁడు.

## పురుష మృగ వృత్తాంతము

తరువోజ. అవనీశ! రాజసూయము సేయ నెంచి
యఖిలరాజన్యుల నాయజ్ఞమునకు
నవు నట్లు పిలిచి నీవపుడు దీక్షితుఁడ
వై యుండు నప్పుడు హరి నిన్నుఁ బిలిచి
యవనిఁ గల్గినవార లందఱు నన
నార్థము వచ్చి రోయవనీతలేంద్ర!
నవము సాగెడునాళ్ళ సతతభోజనము
జరుగుచుండును గద సర్వతలముల. 69

వ. ఉచ్ఛిష్టసమ్మార్జనంబు చేసి భూతలంబు పూతంబు గావించుట భోజనంబుపెట్టుటకంటెవేయిమడుంగులుకష్టతరంబై యుండుమఱియును.

సీ. భుజియించి విడిచినపుల్లైలలో శిష్ట
మైయుండుతక్రము నాజ్యము దధి
మెదుకులు పచ్చళ్లు మేళనమై నేలఁ
బడి మాగి యెండపైఁబడుటఁ గుళ్ళి
గొ ల్పొట్టి ముక్కులం గాల్చెడి నట్టిదై
పొలము నల్మూలలు గలయఁ బర్వి
పెనుగాలి గొట్టినం బెడమోము పెట్టక
ప్రాణికోటులమేనిఁబోని కేగి

తే. అంటువ్యాధులఁ బుట్టించి యట్టునిట్టు
ప్రాకి ప్రళయాంతకం బయి లోకమునకు
హాని తెచ్చెడునట్టిదై యతిశయించు
మనము తచ్ఛాంతికై యత్న మొనరుపఁ దగు. 71

ద్విపద. అని నీకుఁ బోధించి హరి భీముఁ బిలిచి
హనుమంతు నెఱుఁగుదు వట నీవు పోయి
పురుషమృగము దేరఁ బుచ్చెనుఁ గృష్ణ
పరమాత్ముఁ డని చెప్పి వరరాజసూయ
మఖము నెఱింగించి మఱి మఱి వేఁడ
సఖుఁ డయి కపి నీకు సాయ మొనర్చె
నని పుచ్చె నతని నీ వరయుచు నుంటి
జననాథ తన్మఖ సమయమునందు
నెన్నికోటులు భుజియించిరో నీకు
నెన్నంగ వచ్చున శ్రీహరి చేసెఁ
గోటికి నొకమాఱు కొట్టెడుగంట
మేటి యాతఁడు నిల్చె మీఁదఁ నొక్కప్పు
డాఁగక దెబ్బపై యాగంట దెబ్బ
గాఁ గొట్టె నదినీవు గాంచి కృష్ణునకు
నెఱిగింతు గడియాఱ మిది చెడె ననుచుఁ
బఱికించి కృష్ణుఁడు పదిల మాగంట
సూర్యునికన్నను సూటిగాఁ దిరిగి
పర్యవసానము పలుకుచు నుండె
నిన్నటికంటెను నేఁడు భోక్తలును
సన్నమై యుండి రీస్థలములయందు
నని చెప్పవత్తువో యవనీశ రమ్ము
కనిపింతు నని నిన్నుఁ గైకొని వనికిఁ
జని యందు నొక్కవృక్షతలంబుక్రింద
కనుమూసికొని లోనఁ గనుచు నీశ్వరుని
భుజియించుచుండెను మునిముఖ్యుఁ జూపి
సుజనుఁ డీతఁడు చూవె శుకుఁడు లోకైక

వినుతుఁ డీతఁడు నోట వేసెడుకబళ
మున నెన్ని మెదుకులు పొసరుచునుండు
నన్ని లక్షలజను లాహారతృప్తిఁ
గొన్నయట్లగు నని కొట్టు నీగంట
తప్పె ననుచు నీవు తబ్బిబ్బుపడఁగ
మిప్పరమర్షి తా నేతెంచి వంట
ఇంటికి యాచించి ఇట తెచ్చి మెసవు
చుంట తెలిసి మ్రొక్క మహారాజచంద్ర!
యని చెప్పి తాఁ ద్రాణ మగునట్లు చేసె
ఘనుఁ డితం డంతయుఁ గంటివి నీవు, 72

## భీమసేనుఁడు పురుషమృగముం దెచ్చినకథ

వ. ఆకర్ణింపు మట్లు శ్రీకృష్ణప్రేషితుం డగు భీమసేనుండు తొల్లింటి కపిరగిరిప్రాంతంబునకుం జని హనూమంతుం గానఁ జాలక సర్వప్రదేశంబు లన్వేషించుచు నుచ్చస్వరంబున నాహ్వానంబు గావించినఁ గొంతలో హనూమంతుండు కపిలానదీగర్భభూభాగంబున నడంగి యున్నవాఁడు గావున భీమసేనునికంఠస్వరంబు వినివచ్చి మ్రొక్కినం గ్రుచ్చి కౌఁగిలించుకొని నీవచ్చినకార్యం బేమి యని యడిగి సర్వంబు నెఱింగి. 73

చ. పురుషమృగంబుఁ దెచ్చుటకు బోవుచునుంటివె వెఱ్ఱితమ్ముఁడా
శరభము సాళ్వ మన్న మృగజాతులకంటెను ఘోరమయ్యయో
పురుషమృగంబు దాని నెటుపొందెదు నెట్టులు కందొ కృష్ణుఁడే
వెరవునఁజేసి నిన్నిటకు వెళ్లఁగఁ బుచ్చెను చెప్పఁ జూతువే. 74

వ. అనిన భీమసేనుం డన్న కిట్లనియె. 75

క. పురుషమృగ మిట్టి దంచుఁ
బరిపరిరీతులను కృష్ణభగవానుఁడు దా

వెరపించి యవల నిన్నుం
గరుణించెను భ్రాత యచటఁ గలఁ డని చెప్పెన్. 76

వ. నే నాధైర్యంబునం జేసి వచ్చితి నింక నీచిత్తము నాభాగ్య మనినం
గరుణాతరంగితాంతరంగుండై వాయునందనుండు వృకోదరుం
గాంచి యిట్లనియె. 77

చ. పురుషమృగంబు క్రూర మని పోల్పగ వచ్చెదుఁ గాని తమ్ముఁడా!
నిరతశివార్చనారతియు నిత్యహరస్మరణంబు తద్వ్రతో
త్తరములు గాన నా కిపుడు దాని గ్రహింపఁగ శక్తి కల్మికిన్
భరతకులేంద్ర మకార్య మగుఫక్కి కుపాయము దోఁచె వింటివే. 78

ఉత్సహ. నాతనూరుహంబు లెల్ల నవ్యశైవలింగముల్
చేతవిసరినంత నేలఁ జెన్నుమీఱు వాని నా
పూతపురుషమూర్తి యెదుటఁ బోలఁ జూచి నంత నా
భూతనాథుపూజఁ జేసి పోవుఁ బోదు రిత్తగన్. 79

క. కావున నాతనురుహములు
నావాలమునుండి గొనుము నాతమ్ముఁడ నీ
కావాఁడు వశ్యుఁ డగుఁ బో
మ్మావల శ్రీహరియె నీకుఁ గలఁ డన్నిటికిన్. 80

వ. అని గుప్పిళ్ళకొలంది తనూరుహంబులు తీసి యిచ్చి నీవు వీనిఁ గొని
పోయి కాంద్రంచు మీఁదఁ బడఁబోవుదానియెదుట వీనిం జల్లుచుఁ
బొమ్ము పురుషమృగంబును వాని కన్నింటినిఁ బ్రత్యేకసహస్రనామం
బులం బూజించి కాని కదలం బోదని రహోబంధనంబు చేసి యంపి
పుచ్చిన వృకోదరుండు తచ్ఛూచితమార్గంబునం జని చని యొక్క
మహారణ్యంబున హుమ్మని పయిం బడవచ్చు పురుషమృగంబుం
జూచి శతరుద్రీయంబు జపించుచు నాంజనేయువాలకేశంబుల నత్తల
బున వెద జల్లి వెనుక మొగంబు పెట్టి పఱవం జొచ్చె నంతలో
నదియును. 81

సీ. ఎల్లలింగంబుల కింతలోన సహస్ర
నామార్చనము సల్పి నేమ మెసఁగఁ
బ్రార్థించి ప్రాంజలియై పురోభాగము
నందుఁ బూరుషుఁ గాన కందు నిందుఁ
జూచి పాఱె నటంచుఁ జులకన వెన్నంటి
పాఱఁ జొచ్చెను వాయువరసుతుండు
కపిలానదీప్రాంతకాంతారమునఁ జల్లి
కపిరగిరిం దాఁటి కదలి పోయె
తే. పురుషమృగ మట కరుదెంచి హరుఁ గాంచి
లింగపూజ యొనర్చి పోవంగ నున్న
యంతలోఁ గపిరాద్రి ప్రత్యక్ష మైన
దానికిఁ బ్రదక్షిణంబులు పూని చేసి. 82
ఉ. పచ్చని జాలఁ బర్వతము పైపయి నంతటఁ జూచి పూరుషుం
డచ్చట నిల్చి జాలపయి నన్నిటియందును రామ తారకం
బచ్చునఁ బోసిన ట్లెదుట నారయ వచ్చుటఁ జేసి భక్తిపెం
పచ్చుపడంగ హన్మఁ డటు లచ్చట నుండు టెఱింగి యుంటచేన్. 83
వ. ఆ ప్పర్వతంబునకు సహస్రవారంబులు ప్రదక్షిణనమస్కారంబులర్పించి ప్రతిశిలాఫలకంబును విష్ణుసహస్రనామంబులం బూజించి ప్రయాణంబై కొంతలోన వరాహానదీప్రాంతకాంతారంబున వడివడిం బఱచు వడముడిం గాంచి పోకు పోకు మని గద్దరించి పలుకుచుఁ నింతలోనం బట్టనున్నసమయంబున గుప్పిటిలోనం గలకోటికేశంబుల నాక్షేత్రంబునం బడఁ జల్లి యల్లన బ్రహ్మలింగేశ్వరునకుం బ్రణమిల్లి పురోగమనంబు గావించె నంతలోఁ బురుషమృగంబును గోటిలింగంబులకు నట నారాధనంబు గావించి వెన్నంటి చనియె భీముండు పురుషమృగంబు దరిసిపట్టుకొననున్నప్పు డల్ల నల్లన తనూరుహాంబులంజల్లుచుఁ గాశీపురంబునఁ బంచక్రోశంబులమేఱ జేతిలో నునుపనియు

జల్లి త్వరత్వరప్రయాణంబుల నింద్రప్రస్థపురంబుఁ జేర వచ్చి హజారంబుకడ గుమ్మములో నణఁగు వెట్టి మహారాజా రక్షింపు మని మొఱ్ఱవెట్టె నంతలో నీవు పోయి వానిచేయి నట్టితి వాలోఁ బురుషమృగంబువచ్చి గేహాళి కావలనున్న వానికాలిం బెట్టె నంతలోన సాక్షాత్పరమేశ్వరుం డగుశ్రీకృష్ణభగవానుఁడు దర్శన మిచ్చుటం జేసి కాలు విడిచి వీనికిం బ్రదక్షిణంబులు కావింపఁ జొచ్చె శ్రీకృష్ణుండును దాని ననునయించి భగవత్కార్యం బెఱింగించి పాండవపక్షపాతి యగు నట్లు కావించె నది యంతయు నీయెఱింగినదియ యీమహాపురుషమృగంబు. 84

క. యము నైన నింతలోపల
నమలంగాఁ జాలినట్టినాళిమృగంబై
సమయింపఁ జూచి యుండియు
క్షమగలదై యుండె నట్టిసమయముసందుక. 85

వ. ఇదిహనుమంతుని తపఃప్రకారంబును బురుషమృగప్రభావంబు నని చెప్పిన ధర్మనందనుం డానందకందళితహృదయారవిందుండై హనుమంతుండు వాయునందనుం డనియు నీశ్వరాంశసంభూతుం డనియు నంజనాసుతుం డనియుఁ గేసరినందనుం డనియు నందఱు నన్నివిధంబులం జెప్పుదు రతని జన్మవృత్తాంతాదికం బంతయు విన నెంచితి నానతిమ్మని నారదమహర్షి నడిగె నని చెప్పిన నైమిశారణ్యవాసులా వృత్తాంతంబు సవిస్తరంబుగ మాకుఁ జెప్పుమని సూతునడుగుటయును.

ఆశ్వాసాంతము.

గద్యము

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, వేదవిద్యావిశారద, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, ప్రసన్నవాల్మీకి, అపరబృహస్పతి ప్రముఖబిరుద విరాజమాన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన ప్రసన్నాంజనేయప్రభావంబను మహాప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

# కపిరగిరి చరిత్రము

## ప్రసన్నాంజనేయ ప్రభావము

### ద్వితీయాశ్వాసము

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు ధర్మనందనుం డడిగిన శతానందనందనుం డెల్లవారు విన నానందంబున నిట్లనియె.

తే. రామచంద్రుఁడు లక్ష్మణస్వామితోడ
రావణాపహృతకా సీత నావనముల
నరసి కొంచును ఋశ్యమూకాద్రిచెంతఁ
గలిఁ గదుచుచు విహరించుకొనెడునపుడు. 2

వ. నే నమ్మహాత్మునిదర్శనంబునకుం బోయి సంభాషించునపుడు హనుమంతుని ప్రశంస రా నతం డతనిచరిత్రం బంతయు సవిస్తరంబుగం జెప్పు మనిన నే నప్పుడు చెప్పినచొప్పున నిప్పుడు మీకుం జెప్పెద నవహితులరై విన నవధరింపుఁ డని యిట్లని చెప్పందొడంగె. 3

### హనుమంతుని వృత్తాంతము.

చ. కృతయుగ మేగ నున్నపుడు కేసరి యన్ హరివంశశేఖరుం
డతులితవిక్రమాంచితుఁ డహర్పతితేజుఁడు భూతలంబునన్
వితతమహాప్రభావమున విశ్రుతికెక్కి మహేంద్రపుత్రుఁడై
క్షితి నగునాని కాప్తుఁ డయి శ్రేయము లొంచుచు నుండె దండియై.

వ. అక్కాలంబున గౌతమపారికాంక్షి యహల్యం బెండ్లియాడి యామె వలన శతానందుం డనునందను నంజనాదేవి యనునందనం గాంచి

సంసారంబు సాగించుచుండె నాశతానందుండె మిథిలాపురాధీశ్వరుం డగుజనకునకుం బురోహితుం డయ్యెనంత. 5

సీ. అయ్యహల్యాపుత్రి యగునంజ నాదేవి
కేసరి కేల్పట్టి కృతమువలన
సంధురాలై మందరాచలంబున నుండి
పరమేష్ఠి మెచ్చంగ బాఢతపము
గావింప నాతండు కరుణించి వాయుదే
వునిఁ బిల్చి నిచ్చ లంజనకు భుక్తిఁ
గలిగింపు మనఁగ నాఘనుఁడు ప్రత్యహ మొక్క
ఫల మామెవోయిట నిలిపి పోవు

తే. ఆమె భక్షించు నిట్లుండ నంత నొక్క
నాఁడు దుర్గామహేశ్వరుల్ వేడుకమెయిఁ
గాన విహరించుచొక్కచోఁ గపులు మిథున
కర్మ మొనరింపఁగాఁ గాంచి కామవశత. 6

వ. తామును గపిదంపతులై క్రీడించునంతఁ గొంతలోన హరునివీర్యంబు జాఱి ధారణిం బడియె దానిం గాంచి చింతించి వాయుదేవుం బిలిచి నీ వీవీర్యంబుఁ గొనిపోయి యంజనాదేవిగర్భంబునం బెట్టుము దానినామె గర్భంబు ధరించిసర్వరాక్షసాంతకుండును రామభక్తుండు నగునొకకుమారుం గను నతండు నీకును నాకును బుత్రుండు నా వ్యవహరింపం బడుచుండు ననినఁ బవమానుం డానందంబున దానిం గొనిపోయి యంజనాదేవిం గూడి హరుండు చెప్పినచొప్పునం జేసె నంత నామెగుర్విణియై నవమాసంబులు మోసి కుమారుం గాంచి స్వర్గంబునకు నిర్గమించె నంత నక్కుమారుండును క్షణక్షణప్రవర్ధమానుండె.

## హనుమంతుఁడు సూర్యుని మ్రింగఁబోవుట.

మ. ఉదితార్కుం గని పం డటంచు మనమం దూహించి పైకేగి మ్రిం
గఁ దలంపంగఁ దలంకి భాస్కరుఁ డజున్ గాఢార్తిఁ బ్రార్థింప నా
సదయుం డయ్యనుఁ బోన వచ్చుటయు నిస్సందేహుఁడై యాభయ
ప్రదుఁ డాధాతను వాలపాశమున సంబంధించె సంధుల్ చెడన్. 8

మ. అపు డింద్రుం డరుదెంచి వజ్రమున వేయన్ దాన మూర్ఛిల్లె నా
కపివర్యుం డది చూచి వాయువు జగత్కళ్యాణమై ప్రాణమై
సుపరివ్యాపృత మైచనై జతనువుల్ శోధింప, గాఁజేసె వి
ష్టపముల్ దానఁ జలించెఁ బ్రాణితతికిన్ సంక్షోభ మయ్యెం గకున్.

వ. అప్పు డింద్రాదిబృందారకబృందంబులు ఋషికదంబంబులతోఁ గైలాసంబునకుం జని పరమేశ్వరుం బ్రార్థించి విన్నవించిన నతం డంతయు నెఱింగి వారి కిట్లనియె. 10

చ. వనచరుఁ డస్మదంశమున వాయుతనూజుఁడు గాఁగ నంజనా
వనితకుఁ బుట్టె నాతఁడు సపర్వతకాననసాగరావనిన్
గొనకొని మోయఁ జాలినఘనుం డని మీర లెఱుంగుఁ డవ్వలన్
జననము నొందురామునకు సాయపడున్ ఖలులన్ వధించుచోన్.

ఆ. అతని లేవనెత్తుఁ డంత జగత్ప్రాణుఁ
డలుక వీడు ననిన నతఁడు హనుమ
యెడకు వచ్చి యమృత మిడి వానిమోముపైఁ
జల్లి లేవనెత్తె నల్ల నల్ల. 12

వ. మఱియు నజుం డాతని కత్యంతసత్వంబును జిరాయువును నానాస్త్ర
శస్త్రప్రతిబంధంబును గలుగ వరం బొసంగుచు నమూల్యమణిమయ
వజ్రకవచకుండలంబు లిడి చనియె జననకాలంబున నర్కంబునం
బడుటం జేసి హనువు విఱిగినదాన నతండు హనూమంతుండు నాఁబడి

లందును బసిశుండై గురుదక్షిణ మొసంగువాఁడై గురుపుత్రుండును
బరమోత్తముండు నగుసుగ్రీవు నాశ్రయించి యుండె నంతఁ గాలాం
తరంబున. 13

## హనుమంతుఁడు రామలక్ష్మణులం గాంచుట

శా. సీతాన్వేషణ మాచరించుచు వనిన్ శ్రీరామచంద్రుండు తో
డై తమ్ముండు మెలంగుచుండ నొకనాఁ డాఋశ్యమూకాద్రికిన్
జేతోమోదము లేనివాఁ డగుచు రా శృంగాగ్రమందుండి ఖ
ద్యోతాత్మోద్భవుఁ డట్టిచూచె నిల నయ్యుర్వీతలాధీశులన్ 14

ఆ. చూచి భీతుఁగుడిచి సుగ్రీవుఁ డీవచ్చు
వారు వాలిపంపువలన నైన
వార లనుచుఁ జింత వదలని దగుటయు
మంత్రివరులఁ జూచి మాటలాడె. 15

తే. అపుడు వారలు తామేమొ యనుచునుండ
నాంజనేయుఁడు చేమోడ్చి యనియె నిట్లు
వాలిపంపునవచ్చినవార లనుచు
వారియెడ సందియం బడవలదు వినుఁడు 16

ఉ. వారలు దేవరూపులగువారలు వారిశరీరసౌష్ఠవం
బారయఁ దోఁపవచ్చెడిని వాలిని దేశము కాదు గాని దై
త్యారిని దేశముం గొని ప్రియంబున నిన్నును మమ్ముఁ దేర్పఁగా
నీరహి ఋశ్యమూకమున కిష్టరుదెంచి రటంచు నెంచెదన్. 17

క. నావుడు సుగ్రీవుం డను
నీ వాకడకు వటువేష మేత్తెఱఁ గొని పో
మ్మీవాసి యగునొ మాటల
భావంబున నెఱిఁగి రమ్ము వాయుతనూజా 18

శా. రాజర్షి ప్రవరుల్ సుర ప్రతిము లోరమ్యాంగులారా భవ
ద్రాజద్దేశ మదేది? యేమిటికి నేతత్కాననప్రాంతముఁ బ
ద్రాజీవంబులు కంద మెట్టుకొనుచుర్ రా నయ్యె మీనామముల్
మీజన్మాదికము న్వచించుటకు నెమ్మిన్నేను బ్రార్థించెదన్. 20

తే. ఏను సుగ్రీవుఁ డను వానరేంద్రు నకును
నీసచివుఁడను నంజనాదేవియందు
వాయువరమునఁ బుట్టినవాఁడ హనుమ
యంద్రు నానామధేయ మో యనఘులార. 21

క. నే నాసుగ్రీవునకున్
మానుగఁ బ్రియమాచరింతు మనుజ నీరూపుం
బూని చనుదెంచినాఁడన్
నానారూపములు దాల్ప నా కగు శక్తుల్. 22

తే. కామచారిని నే నని కడువినీతుఁ
డగుచుఁ బలికిన సౌమిత్రి నరసి రాముఁ
డితఁడు సుగ్రీవసచివుఁడు సుచరితుఁడు
నేరుపరి మాటలందు వినీతబుద్ధి. 23

ఉ. నాలుగు వేదముల్ మఱియు నాల్గును రెండగు శాస్త్రముల్ దగం
బోలిచి నేర్చినట్టిఁ డని బుద్ధి నెఱుంగఁగ వచ్చె వీనివా
గ్జాలమునందు దోష మనుజాడయుఁ గానఁగ రాదు శేముషీ
వేలుపుఱేని దేశికుని వెన్కఁ బడం బొనరించు నెంచఁగన్. 24

వ. నీవు వీనితో నించుక ప్రసంగింపు మనిన వాక్యజ్ఞుం డగులక్ష్మణుండు
వాయుపుత్రునిదిక్కు మొగంబై యిట్లనియె. 25

తే. విద్వదగ్రేసరా మేము వెదకుచుంటి
మర్కపుత్రుని సుగ్రీవు మర్కటవిభు
నీవు చెప్పినచొప్పున నేము చేయు

క. సంతోషించుచు మీ రీ
కాంతారముఁ జేర నెట్టికారణ మగునో
వింత యగు మీచరిత్రము
కొంతయుఁ దాపక వచింపఁ గోరుదు ననుడున్. 27

సీ. లక్ష్మణుం డనుఁ గోసలముల రాజేంద్రుండు
దశరథుం డనుపేరఁ దనరుమేటి
బహుళదక్షిణలతో బహుయజ్ఞము లొనర్చె
నతని కీతం డగ్రసుతుఁడు సూవె
రామనామంబునఁ గ్రాలువాఁడుగా సర్వ
భూతశరణ్యుండు పూతయశుఁడు
తండ్రియాజ్ఞం జేసి దండకావాసముఁ
గావింప వచ్చె స్వకాంతతోడ
తే. అనుజుఁడను నేను సేవకుఁ డగుచు వెంట
వచ్చినాఁడను మే మొక్కవలకుఁ జనిన
యపుడు మారామపత్ని సీతాఖ్య నెవఁడొ
రాక్షసుండు హరించెఁ జౌర్యం బెసంగ. 28

వ. మేము సీతాన్వేషణంబు చేయుచు వనంబులం బడి వచ్చుచుంటి మనిన నంజనానందనుం డానందకందళితహృదయారవిందుండై రామ చంద్రునిఁ గన్నులారఁ గాంచె నప్పుడు. 29

సీ. పదునాల్గులోకముల్ పర్వతపంక్తులు
సప్తసముద్రముల్ సర్వనదులు
సర్వవనంబులు సర్వగ్రహంబులు
సర్వనక్షత్రముల్ చంద్రసూర్యు
లచలాంతరిక్షము లఖిలభూతంబులు
పతనంబులు నదుల్ పక్కనములు

యక్షరాక్షసులు తిర్యక్కులు దేవతల్
సర్వప్రపంచము సర్వదిశలు
తే. రామదేహమునం జూచి రాగరహితుఁ
డగుచు విస్మయంబు భయంబు నాత్మ మొలవ
వటుశరీరము విడనాడి వానరుఁ డయి
తగ వితర్కించె ని ట్లని తగిలి తగిలి. 30

మ. పరమాశ్చర్య మెఱింగికొంటి నిది స్వప్నంబో మహావిభ్రమ
స్ఫురణంబో విపులేంద్రజాలమొ సముద్భూతప్రభావంబు నేఁ
బరికింపన్ సకలప్రపంచమును దోఁప న్వచ్చె నీరాముచే
న రమానాథుఁ డితండు మర్త్యుఁడగుచున్ గన్పట్టు నిప్పట్టునన్. 31

తే. అనుచు ధ్యానించుచుండెనునవసరమున
రాముఁ డక్కపిరాజుపై రత్నకవచ
కుండలమ్ములు దీపించుచుండఁ గాంచి
యనుజుదిక్కు మొగం బయి యనియె నిట్లు. 32

క. చూచితె తమ్ముఁడ కంటికిఁ
దోఁచెడి నీహనుమమేనఁ దులితేంద్రధనూ
రోచి యగుమేలుకంకట
మీచిత్రము చూచి యెఱుఁగ మెప్పుడుఁ గానీ. 33

వ. అనిన శ్రీరామవచనం బాకర్ణించి హనూమంతుండు తొల్లి తన తపంబునకు మెచ్చి పరమేష్ఠి కవచకుండలంబు లిచ్చి తనకుఁ జెప్పిన చొప్పులు స్మృతికిం దెచ్చుకొని శ్రీరాముండు శ్రీహరి యని నిర్ణయించుకొని సాష్టాంగనమస్కారంబు గావించి వినయవినమితాంగుండై చేతులు జోడించుకొని యి ట్లనియె. 34

సీ. నీవు నాస్వామివి నీకు నే దాసుఁడ
నిజము చెప్పుచునుంటి నీరజాక్షుఁ

కమలాసనుఁడు నాకుఁ గవచకుండలముల
నిడి పేరెక్కింగానఁబడవు వీని
నెవఁడు కంటం గాంచి వివరింపఁ జాలునో
యాతండు భూభారహరణమునకు
నవతరించినజగదధినాథుఁడు జనార్ద
నుం డని యెఱిఁగి సేవింపుమదిని

తే. గురువుగా నెంచి సేవించికొను మటంచు
నాఁడు పచియించె నోస్వామి నతి యొనర్తు
నన్ను నీదాసునిం గృపాభ్యున్నతిమెయిఁ
గాచి రక్షింపు మని వేఁడెఁ గాళ్ళఁ బడె. 35

వ. రామచంద్రుఁడును గపీంద్రు లేవనెత్తి గుత్తం బుగఁ గౌఁగిలించు
కొని నీవృత్తాంతం బెట్టిది చెప్పు మనిన హనుమంతుండు ప్రాంజ
లియై మఱియు నిట్లనియె. 36

తే. వాలిసుగ్రీవు లనియెడువారు వాన
రప్రవరులు వారలకు వైరంబు పొడమె
వాలి సుగ్రీవుభార్య రుమాలలనను
నైవసముచేసికొని తమ్ముఁ బోవఁ ద్రోలె. 37

ఉ. ఆవల భ్రాతృభీతిమెయి నందును నందుఁ బరిభ్రమించి సు
గ్రీవుఁడు మున్ మతంగముని కేసరి శాసనముం బొనర్చుటన్
గావరు లెవ్వరీనగముఁ గన్గొనఁ జాలరు గాన నిర్భయుం
డై వసియించు నిక్కుధరమందు నమాత్యులుదాను నిత్యమున్. 38

తే. జాంబవంతుఁడు లోనగుసచివులందు
నే నొకండను మారుతి నా నెసఁగుదు
మిమ్ముఁ గని సూర్యపుత్రుఁడు మిమ్మటు మగు
భీతుఁడై బమ్మరిల్లి నన్ బిలిచి యనియె. 39

మ త్త. వాలిపంపున నన్నుఁ జంపఁగ వచ్చినా రని యెంతు నా
వేలుపుంబొర కెత్తువచ్చినవీరవర్యు లటంచు నో
బాలుమాలిక నైనబీతునఁ బాఱువాఁ డయి యంత నా
జోలిఁ గైకొని యిట్లు మీఁదగుచో నృపులుం గనఁ బుచ్చె సన్. 40

వ. ఇట్లు వారు ప్రసంగించుకొనుచున్నసమయంబున నీనేను. 41

నారదుఁడు హనుమంతు నభివర్ణించుట.

ఉ. కచ్ఛపిమీటికొం చపుడు కమ్మని గానము వీనులంటి ది
వ్యేచ్ఛ జనింపఁ జేయునటు లింపుగఁ బాడుచు నింగినుండి శు
భ్రచ్ఛవి నొప్పుదేహమున రాముఁడు లక్ష్మణుఁ డున్నచోటికిన్
వచ్చుభలగ్నమం దెలమిం దర్శన మిచ్చితి నిచ్చ హెచ్చఁగన్. 42

వ. అట్లు దర్శనమిచ్చిననన్నుం గని రామలక్ష్మణులును హనుమంతుఁ
డును లేచి యెదురు వచ్చి తోడితెచ్చి సుఖాసనాసీనుం గావించి
పూజించి రంత నేను రామచంద్రుం గాంచి. 43

చ. వనముల మీకు నిట్లు బలువంతలఁ జింతలఁ బొంద నయ్యె నీ
వనిత సజీవయై యిపుడు భర్తృసమాగమ మాసఁ జేయుచున్
వనటఁ గృశించుచున్నయది వాసవవందిత! నీకు నింక మే
లొనరెడు సూర్యపుత్రునిసమున్నతసఖ్యము నొందఁ గల్గెడిన్. 44

క. మారుతి యీతం డీతని
కారణమున సీతవార్త గ్రహియింప నగున్
వైరులఁ దున్మి సుఖంబుగఁ
జేరుదు సాకేతపురికి శ్రీరఘురామా. 45

వ. అని పలికి నే నాతనికోరికిం జేసి హనుమంతునిజన్మాదికం బెఱింగించి
వారి నామంత్రణంబు చేసి గగనమార్గంబున నిర్గమించితి నంత
రామచంద్రుండును. 46

మ. హనుమా! నీవు మహానుభావుఁడవు నా కత్యంతభక్తుండవే
మనమందుం గను సంతసించితి నిక న్నాతోడివాఁడైతి నా

వనితారత్నముఁ జెచ్చి భార మది నీపై బెట్టితిన్ ముమ్మఁ దో
కొని పొమ్మారవిజుం జెసంగుకడకుం గోర్కెం బ్రదర్శించుచున్ 47

తే. అనుఁడు హనుమంతుఁ డట్లవు ననుచు వారిఁ
దనభుజంబుల నెక్కుకొని దారిఁ బట్టి
నడచెఁ దారక మార్గమున నిరంత
రముగ వెలువడి మార్మ్రోయ రవము దెసల. 48

వ. అట్లు రామలక్ష్మణుల భుజంబులం గొని చని ఋశ్యమూకంబున
కుపపర్వతం బగుమలయంబున డించి తాను సుగ్రీవునికడకుం జని,
సర్వం బెఱింగించినపదంబడి వారిరువురు నగ్నిసాక్షికముగ సఖ్యంబు
గావించుకొని యంత సుగ్రీవుని ప్రార్థనంబునం జేసి వానిపగతుండైన వా
లిం గూలనేసి వనచరరాజ్యంబున సుగ్రీవునిఁ బట్టభద్రుం జేసినపదం
బడి సుగ్రీవుండు వర్షాగమంబు గడచినంత సీతాన్వేషణార్థంబు నానా
దిక్కుల కగచరవల్లభులం బుచ్చి హనూమంతుం జూచి యిట్లనియె.

తే. బలపరాక్రమబుద్ధులో వాయుపుత్ర!
నీకడ సమగ్రములు నీతి నిన్నుఁ బోలు
వాఁడు ముల్లోకముల లేఁడు లేఁడు లేఁడు
నీవు సాధింప లేనివి లేవు లేవు. 50

ఉ. రాముని కార్య మెట్లయిన రంహముగాఁ బొనరించి నాకు నీ
భుమిపయిన్ యశం బగుసమున్నతి గల్గఁగం జేయు భారమున్
స్వామిపరాయణుండ వయి భాసిలు నీపయిఁ బెట్టియుంటి నీ
వేమి పొనర్తొ యింతకును నీవె ప్రయాణము వాయునందనా. 51

తే. అనుచు సుగ్రీవవచనము లాలకించి
రామచంద్రుఁడు హనుమంతు మోమునందుఁ
జూడ్కి నిగిడించి యెంతయు వేడ్క మీఱఁ
జేరఁగాఁ దీసి యిటని చేసె నుడుగు 52

మ. నిను నేఁ గాంచినదాది నామనమున నీవ వన్నిట న్మేటి వం
చును లోకోత్తరకార్యముల్ సలుపు దంచు న్నీదుమూలంబునన్
జనకక్ష్మాధవపుత్రి వార్త లెఱుఁగన్ సాధ్యం బటం చెంచితిన్
జనకు న్మించితి వార్జవంబునను విశ్వస్తుత్య వాతాత్మజా! 53

క. జనకజకు నభిజ్ఞానము
గ నొసంగెద నంగుళీయకం బిది దీనిన్
గొని నీ వామెకు నప్పన
మొనరించుచు నిట్లు పలుకు మోకపిరాజా. 54

మ. ఇది మీపూర్వపితామహుండు నిమి కెంతే వత్సలత్వంబునన్
విదితాభుం డగుయాజ్ఞవల్క్యమునిరాడ్వేదండ మర్పించె ని
య్యది మీతండ్రి యొసంగె రామునకుఁ గళ్యాణంబుకట్నంబు గా
సదసద్వృత్తము లెల్ల దెల్పు నిది నీస్వాంతంబు శాంతంబుగన్. 55

వ. అని యంగుళీయకం బామారుతిహస్తంబులం బెట్టిన నతండు దాని
శిరంబునం బెట్టి కట్టుకొని కేలుదోయి గీలించి శ్రీరామపాదార
విందంబులకుం బ్రణమిల్లి ప్రయాణోన్ముఖుండై. 56

## హనుమంతుఁడు సీతాన్వేషనార్థమరుగుట

మ. హనుమంతుండు తదాజ్ఞఁ గైకొని యువాగాశావకాశంబులన్
ఘనులన్ జాంబవదంగదాదులను వెన్కం గొంచు వింధ్యాటవిన్
జని యందందు నదీనదంబులను వృక్షచ్ఛాయలం గొండలన్
గనుగొంచున్ జని యెల్లగీము లరయన్ గానయ్యె సీతాసతిన్. 57

వ. మఱియు నాయాప్రదేశంబు లరయుచుం బోయి పోయి స్వయంప్ర
భాబిలంబు సొచ్చి సాముచచ్చినవారై వెలిపచ్చి సంపాతివలన
సీతవృత్తాంతం బింత యెఱింగి కతిపయప్రయాణంబుల దక్షిణాసముద్ర
తీరంబునకుం బోయి భయంకరాకారంబున నాకసంబంటునట్లుండు
దానిం గాంచి వానరోత్తములు భయార్తులై యట్టిట్టు పడుచుండ

శా. నన్నుం గాదనునట్లు కార్యగతికిన్ గా కెద్దియో చూచు చి
ట్లున్నన్ మా కిట నేది దిక్కెవరు మ మ్మోమంగ నున్నా రయో
మిన్నుల్ముట్టి సముద్ర మున్నయది నీమీఁదన్ సమస్తార్థముల్
క్రన్నన్ బెట్టి మెలంగుచుంటిమి జగత్ప్రాణాత్మజా వింటివే. 59

ఉ. నీవు పరాక్రమక్రమవినిర్జిత నిర్జరలోకనేతవున్
దేవసమప్రభావుఁడవు నిన్ను నుతింపఁగఁ జాల మేము ము
న్నావినతాతనూజుని మహాప్రతిభన్ విని యుంటి మాతఁడున్
నీవెనుకన్ గణింపఁ దగు నిక్కము చెప్పితి నమ్ము నెమ్మదిన్. 60

ఆ. శౌర్యసారమందు జవసత్త్వములయందు
బలమునందు బుద్ధిబలమునందు
నధికుఁ డైనకొమరుఁ డగు నని సీతల్లి
కనిలుఁ డిచ్చె వరము హనుమ ! వినుమ. 61

చ. వనమునఁ బుట్టి నీ వపుడు భాస్కరుఁ గన్గొని పండటంచు మ్రిం
గను బయికేగి వేఁడిమినిఁ గ్రాఁగక వేఁగుచు నుండ నీపయిన్
గనుకని వజ్ర మింద్రుఁ డలుకం గొని వైచె న దొక్కవెంద్రుకే
గొనకొని కీడ లేనిదయి కొంకి గమించెను మళ్ళి ద్రెళ్ళనై. 62

ఆ. బ్రహ్మ వచ్చి యపుడు వజ్రంబు దెబ్బకు
లొంగనట్టినీకు లోన మెచ్చి
యస్త్రశస్త్రభయము నాయుధభయము లే
కుండునట్లు వరము లొసఁగెఁ గాదె. 63

క. మే మిపుడు నిన్ను దైవము
గా మదిఁ దలఁపోసి బ్రదుకఁ గా నుంటిమి నీ
వీమొఱఁ జూచుచు నుండకు

వ. అట్లు జాంబవంతుండు ప్రేరింపఁ బ్రతీతవేగుం డగుపవనాత్మజుండు
ప్రహర్షించుచు మేను వెంచినం గాంచి ప్లవంగోత్తములు సంతో
షాయత్తచిత్తులై సింహనాదంబులు గావించుచుఁ బ్రభంజనాత్మ
జుం బ్రస్తుతించిన నతండు సంతోషంబునఁ బుచ్ఛచాలనంబు
గావించుచుఁ గ్రమక్రమంబునఁ ద్రివిక్రమక్రమంబునఁ గ్రమవృద్ధిం
గాంచి విజృంభించి. 65

హనుమంతుడు సముద్రము దాటినకథ

తే. పంచభూతములబలంబు లెంచఁ జేను
తద్బలము నాకొకింతయై తనరఁ జేయు
దును సముద్రము దాఁటుట యనఁగ నాఁకు
లీల యని యెంచుఁడీ భయశీలురార. 66

క. పదివేలయోజనంబుల
పద మొక్కనిమేషకాలపరిమితిలోనన్
ముదమున వాయువు తెఱఁగున
నిదె నే లంఘింప నేర్తు నెఱుఁగుఁడీ మీరల్. 67

వ. ఇట్లు పలుకుచు నంతలో వాయుకుమారుండు మహేంద్రపర్వతం
బారోహించి ప్రాగ్దిశాభిముఖుండై. 68

శా. నన్నుం గన్నసమీరదేవున కిదే నావందనం బెల్ల సృ
ష్టి న్నిర్మించినబ్రహ్మదేవున కిదే చేమోడ్పు ముల్లోకముల్
తన్నుం బోలెను బ్రోచుజిష్ణున కిదే దండప్రణామంబు సం
పన్నోన్నస్రింబుల వెల్గువేల్పున కివే ప్రాంచన్నమస్కారముల్ 69

వ. అని లంకవంక మొగంబు పెట్టి. 70

తే. ప్రాణమును బిగ్గఁ బట్టి మధ్యంబు వంచి

వీఁక నాడించి కొమ్మూఁచి యాకసంబు
వంక మోమెత్తి విదళించి వర్ష్మ మప్పుఁడు 71

సీ. బాహువు లల్లార్చి బలమిక్కమైఁ గ్రుంగి
కుప్పించి కాళ్లను గొండఁ దన్ని
రివ్వున మీఁదికిన్ జువ్వనా లేచె న
త్తాపున కయ్యద్రి దద్దఱిల్లె
శాఖలపుష్పముల్ జలజల రాలెను
గుహాలలో సత్వముల్ ఘూర్ణిలెఁ గడు
గులజా లన్నియు గులగుల్లై కూలె
మ్రాఁకు లన్నియు నేలమట్ట మయ్యె

తే. హోరు మనుశబ్ద మత్తఱి నుర్వితలము
వ్యోమతలమును నిండె మహోన్నతముగ
నఱచుచుం బక్షులెల్లెడఁ బఱవఁ జొచ్చె
నగచరేంద్రుఁడు నింగిపై కెగిఱినపుడు. 72

తే. హనుమపై వేల్పు లప్డు లతాంతవృష్టి
కురిసి రుత్తరవాయువుల్ గొట్టె సూర్యుఁ
డెంతయేనియుఁ జల్లనై యెసక మెసఁగె
మునులు దీవించి రమరులు పొగడి రతని. 73

వ. అంతలో నాంజనేయుం డమ్మార్గమధ్యంబునఁ దన్నెదుర్కొనిన మైనాకుం బాణితలంబున నించుక స్పృశించి పోవుచు దేవతల పంపునం దన్నుఁ బరీక్షింప వచ్చిననాగమాతను సురసం గెలిచి ఛాయాగ్రాహిణి యగుసింహికం దెగటార్చి సముద్రంబులంఘించి.

సీ. లంకిణి నిర్జించి లంకాపురప్రవే

ప్రాకారములు దాటి పరిఘలు లంఘించి
రాజమార్గంబునఁ దేజుమెఱసి
వివిధహర్మ్యంబులు వీథులు తిలకించి
చత్వరంబులయందు జాడ లెఱిఁగి
గుడిగోపురంబుల నడయాడుచుం జూచి
పానశాలలు సొచ్చి కాన లేక

తే. నర్తనాగారములును గానగృహములును
పాకశాలలు గజవాజిభద్రశాల
లాయుధాగారములును వ్యాయామశాల
లరసె హనుమంతుఁ డెంతయు నప్పురమున. 75

వ. ఇట్లు సూక్ష్మరూపుండై వివిధప్రదేశంబుల సీతాన్వేషణంబు చేయుచు హనుమంతుండు క్రమక్రమంబునఁ బ్రహస్త మహాపార్శ్వ కుంభకర్ణ మహోదర, మహాకాయ, విరూపాక్ష, విద్యుజ్జిహ్వ, వికట ప్రభృతులగృహంబు లెల్ల వెదకి పుష్పకవిమాన భాగంబు లెల్లఁ బరిశీలించి రావణాంతఃపురంబు నలుగడం గలయఁ బరికించి యెందునుం గానక మిగులవగలం బొగలుచు నంతలో నశోకవనంబు మనోగతం బగుటయును. 76

## హనుమంతుఁడు సీతను దర్శించిన కథ

క. కన నొక్కలంగ నచటికిఁ
జని మారుతనందనుండు సర్వస్థలమున్
గనుఁగొనుచు నడచి నడచియు
వనితామణి వెదకికొనుచు వగ నొకచోటన్. 77

సీ. స్నేహచర్చ యొకింత చేయమి జడగట్టి
కటివ్రాఁక. వ్రేల్ తలకట్టుదాని

నేనాడుఁ గాటుకం గానకుండుటఁ దెల్లఁ
　　బోయిన ట్లగుకన్నుదోయిదాని
నన్నపానము లెప్డు సున్న గావున వగ
　　ఘాఁకునా నున్నమైడాఁకదానిఁ
నుడుకు లెన్నఁడు లేమి నుర్వీరజం బంటఁ
　　గడుమాసి యున్నవల్కలముదానిఁ
తే. గేలు తరుశాఖపై వైచి వ్రాలియున్న
దాని రక్కసజాపుల కైనదాని
గనుల బాష్పజలంబులు గార్చుదాని
సతము రామా యనుచు నుడి సలుపుదాని. 78

క. నారీమణిఁ గని యీయమ
యే రామునిపత్ని సీత యేఁ గనుఁగొంటిన్
నారచియించినపున్నెపు
దారి కడు న్మేటి యయ్యె ధన్యుఁడ నైతిన్. 79

మహాస్ర. అనుచుం దర్కించుకొంచున్ హనుమఁడు మదిలో
　　హర్షంముం బొందె మే ను
బ్బినదై యుండంగఁ గన్నీ ర్వడలెడు మొగమున్
　　బెల్చ వీక్షించి దుఃఖం
బున నై లోకస్తుతుండై పౌనరెడుదారకున్
　　బుట్టె లోకేశ్వరుం డై
చనుమేటిం బట్టె యిల్లై సవు రటి వగలన్
　　జావనై యుండె నయ్యో. 80

ఉ. రక్కస లెల్ల మూగికొని రాపులు వెట్టగ నెట్టు తోప కీ
చక్కినిఁ జెట్టుకొమ్మపయిఁ జక్కనిహాస్యము సాఁగ వైచి యే

దిక్కును గానరామి కతిదీనతఁ బొక్కుచు నుండె నక్కటా
యిక్కమలాయతాక్షి యిఁక నేమని చెప్పఁగనుండు దైవమున్.

వ. అని వగలం బొగులుచు నంతలో రావణుండు వచ్చిపోవుట
రాక్షసాంగనల తర్జనభర్జనంబులును బర్ణాంతరవిలీనదేహుండై
యుండి సీతదిక్కు దృష్టివెట్టి చూచుచుండె నాలో నామెయును.

చ. ఖలుఁ డగురావణాసురుఁడు కావలుఁడై చను దెంచి యెన్నియో
తులువతనంబునం బలికి దొప్పలు దోరలు గాఁగ రెండుచం
దులు గడు వుంచి రక్కసలతో వచియించి గమించె వీండ్రు నన్
బిలుకురఁ జేయుచుండి రెటు వేగుదు నేమి యొనర్తునక్కటా. 83

తే. ఆత్మహత్యాతిపాతక మైన నైతుఁ
గాని శ్రీరామవిరహదుఃఖంబు నైపఁ
జాలఁ గావునఁ జచ్చెదఁ జచ్చుటకును
సాధనం బెద్దియుం దోప దీధరిత్రి. 84

వ. అని మరణోద్యోగంబునం గృతనిశ్చయురాలై నిజజటాజూ
టంబు విప్పి కుత్తుకకుం జుట్టఁ బెట్టుకొని కొమ్మకుం గట్టి యురి
వేసికొన నెంచుచుండె నట్టియవసరంబున. 85

ఆంజనేయుఁడు సీత విన రామకథం జెప్పుట.

ఉ. ఆఁకుమఱుంగుఁబిండై యగునంజననందనుఁ డెట్లు నేను సీ
తాకమలాయతాక్షికడ దర్శన మిచ్చెద నేమి చెప్పెదన్
నాకృతకాకృతిం గనిన నమ్మునో నమ్మదో రాక్షసుండె సు
మ్మీకరణిన్ బ్రతారణము నిట్లు పొనర్చెదునంచు నెంచునో. 86

వ. అని తలంచుచు నెట్లునుం జేయఁదోపమిఁ నామె కించుక కానిపించు
నట్లు సమీపశాఖాగ్రంబునం గూరుచుండి యోంకారంబు

గావించి రామమంత్రంబు పఠించి రామలక్ష్మణభరతశత్రుఘ్నుల జన్మంబును గౌశికయాగరక్షణంబును మిథిలాపురప్రవేశంబును శివధనుర్భంగంబును సీతాకళ్యాణంబును వనవాసంబును మాయా మృగదర్శనంబును సీతాపహరణంబును సుగ్రీవసఖ్యంబు నను క్రమంబునం బఠించి యించుక సమీపించి. 87

శా. ఆకాశంబున నుండి రావణుఁడు ని న్నంసంబునం గొంచుఁ బోఁ
గాక న్నీవు విభూషణంబు లవి పెక్కు ల్గట్టి వేయంగ నేఁ
జేకొంచుం గుహ దాచి రామునకు వీక్షింపంగ నీ రాముఁడున్
శోకం బెంతయుం వెల్లువాఱఁగనియెం శుద్ధాంతకాంతామణీ. 88

తే. అవల సుగ్రీవునకు నన్న యైనవాలిఁ
జంపి వానరరాజ్య మొసంగె నతఁడు
దిక్కులకుఁ బుచ్చె వానరాధిపుల నెల్ల
నిన్ను వెదకెడుపనికయి సన్నుతమతి. 89

ఆంజనేయుఁడు సీతకుఁ దన్నెఱింగించుట

ఉ. అం దొకరుండ నే హనుమ య న్నుడికారము గల్గునట్టి డన్
గొందఱతోడఁ గూడుకొని కొండ లరణ్యము లెల్ల రోయుచున్
ముందు మహార్ణవంబు గని మోదము వోఁ గపులెల్లఁ గుందుచో
నందఱ నందుఁ బెట్టిలవణాంబుధి నిట్టులు దాఁటి వచ్చితిన్. 90

సీ. ఈచెట్టుపైనుండి యీక్షించితిని నిన్ను
స్వాంతబుతోఁ గన్ను చల్లఁబడియెఁ
గాని నీగతికి దుఃఖం బయ్యె నంతలో
రావణురాకయు రక్కసులయు
రాపులుం గంటివారలఁ జంప నెంచితి
నట్లు కా దని శాంతి నందితి నిది

సమయ మంచు నీదుసందర్శనము సేయ
వేచియుంటిని దల్లి! నీచుఁ డైన
తే. రావణునిచెయ్వులో యని భావమందు
సందియంపడఁ బోకు మోసాధ్వి నేను
రామదూతను సుగ్రీవుప్రాణసఖుఁడ
ననిలపుత్త్రుఁడ హనుమంతుఁ డనెడువాఁడ. 91

క. మాయావిగాను తల్లీ!
నాయాకృతిఁ జూచి మనమునన్ సంశయమున్
జేయకుము కరుణఁ జూడుము
నాయెడ నే రామదూత నమ్ముము నెమ్మిన్. 92

వ. అనిన సీత రామదూతపైనింతప్రత్యయమ్ము గలిగినదయ్యు నెయ్యంబున నోయీ! నీవు రాము నెఱింగినవాఁడవయేని నా కభిజ్ఞానంబుగ వానిగుణంబు లభివర్ణింపు మనిన నంజనానందనుం డానంబున రామచంద్రు నభివర్ణించి మఱియెన్నియో యడియాలంబులం దెలిపి. 93

క. నీదాసుఁడ నని చెప్పిన
నేదో శంకింతు నమ్మ వింతయుఁ దల్లీ
నీదయితుఁ డిచ్చె నుంగర
మీదెస వీక్షింపు మనుచు నిచ్చెం దానిన్. 94

చ. అది తనతండ్రి రామునకు హస్తపరిగ్రహవేళ నీయ నై
నది ఋషినిర్మితంబు నిమి కాది లభించిన దంచు నెంచి స
మ్మదమునఁ గొంచు గన్నుఁగవ మాటికి మాటికి నద్దికొంచుఁ జ
ల్లదనము మేనికిం గలుగు లాగని యాఁదలఁ దాల్చె దానినిన్ 95

వ. అంతఁ గొంతలో సీతాకాంత హనుమంతుని దిక్కు మొగంబు

వృతులై వచ్చి రావణుని దెగటార్చి నన్నుఁ దోడికొనిపోవునట్లు చేయు మని నిజశిరోభూషణం బానవాలుగ నిచ్చి దీవించి యంపిపుచ్చె హనుమయు నామెకుం బ్రదక్షిణంబు గావించి పోయి వత్తునని చెప్పి మెప్పించి కుప్పించి యుప్పరంబున కెగసి.

వనభంగము_లంకాదహనము

ఆ. నాపరాక్రమంబు చూపి రావణునితో
మాటలాడిపోవ మనసుపుట్టెఁ
జేయ నెట్టు లద్ది సిద్ధించునో యని
యుపవనంబుఁ గూల్ప నుద్యమించె. 97

వ. ఇట్లుపవనంబును గూల్చుట లెఱింగి రావణ ప్రేరితులై తనపైఁ బడిన యెనుబది వేలకింకరులం జంపి జంబుమాలిం గూలనేసి మంత్రి పుత్రసప్తకంబుం జానేసి విరూపాక్షున కక్షయ్యపుణ్యాలోకంబు లొసంగి యక్షకుమారుం భక్షించి యింద్రజిత్తుతో ఘోర యుద్ధము చేసి రావణదర్శనేచ్ఛం జేసి బ్రహ్మాస్త్రబద్ధుండై పడిన వానిం బట్టుకొని రావణాసురునియెదుట పెట్టిన నతండు పెచ్చు పెఱిగినమత్సరంబునఁ గ్రోధసంరక్తలోచనుండై యీమర్కటంబు మాపీటకేలవచ్చెనో వనభంగం బేటికిచేసెనో యసురోదుల నేల కూల్చెనో చెప్పం దగు ననిన నతం డతని కిట్లనియె. 98

ఆ. వానరుండ నేను వచ్చితిఁ బురిఁ జూడ
వనము జాతిధర్మమున విఱిచితి
నన్నుఁ జంప వచ్చునాలిభూతములను
రాల్చినాఁడఁ బ్రాణరక్షపొంటె. 99

వ. అని యెన్నో చెప్పఁ దగినట్లుచెప్పినం గ్రోధతామ్రాక్షుండై

కాజ్ఞ యిచ్చియు దూత వధార్హుండు గా డని మంత్రులమంత నంబున వానిలాంగూలంబునకు వస్త్రంబులు చుట్టి నిప్పు వెట్టిన నతం డంతలో నంతకుమున్నం గలతన మేనికట్లనెల్లం ద్రెంచుకొని ఱివ్వున నాకసంబున కెగిరి పేరువరుసన యెల్లరాక్షసగృహంబులు భస్మావశేషంబు గావించి సముద్రజలంబునం దనవాలాగ్నిం జల్లార్చుకొని వెండియు సీతాదర్శనంబుచేసి సముద్రంబు దాఁటి తనవారితో సీతం గంటినని పోయివచ్చినవృత్తాంతం బంతయుం జెప్పి వారితోడం గూడి కిష్కింధాపురంబున కుం జని రామ చంద్రుం గాంచి నమస్కరించి. 100

హనుమ రామునకు సీతావృత్తాంతము చెప్పుట

ఉ. చూచితి సీత నే నట నశోకవనంబున-రాక్షసాంగనల్
రాచి కడుంగడు న్వ్రాతల రాయిడిపెట్టుచు నుండ వారలన్
ద్రోచి జనిత్రితో నుడులు తోఁపఁగఁ బల్కితి రామముద్రిక
న్దాచినదానిఁ దీసి యిడినా నడియాలము గాఁగ నామెకున్. 101

వ. అని తనపోయివచ్చినవృత్తాంతం బంతయుఁ ఘూసగ్రుచ్చినట్లు చెప్పి తాను దెచ్చినమాణిక్యం బానవా లిచ్చుటయు రామ చంద్రుం డక్కునం జేర్చుకొని పరమానందభరితుండై హర్ష భాష్పంబులు విడుచుచు నాంజనేయు నభినందించుచు సుగ్రీవు దిక్కు మొగంబై. 102

మ. గరుడామంతుఁడు గాలితక్క యొరుఁ డొక్కం డేనికే దాఁట దు ష్కర మౌ నీమకరాలయంబు గడెలోగం దాఁటి వచ్చెన్ మహో త్తరుఁ డీమారుతి వీనిసాహసము మేధాశక్తిశౌర్యంబులున్ బరిపాటిన్ వచియించు టెవ్వరి కిలన్ సాధ్యం బగు న్మిత్రమా. 103

ఆ. వీని కేమి యిడినఁ గాని కొంతయే
నాదుహృదయపద్మ మీఁదయితున

కిత్తు ననుచు హనుమ నెంతయు నక్కున
హత్తఁ జేసి వాని నాదరించె. 104

శ్రీరాముఁడు రావణుని సంహరించి స్వపురి కేగుట.

వ. అని ప్రశంసించువానివలన రామచంద్రుండు లంకావృత్తాంతం బంతయు విని సుగ్రీవునకుం జెప్పి శుభముహూర్తంబునఁ బ్రస్థానభేరి వేయించి సర్వవానరసేనాసమేతంబుగాఁ బ్రయాణంబై కతిపయప్రయాణంబుల దక్షిణసముద్రంబు దరికిం జని దానిపై సేతువుం గట్టించి లంకాపురంబు ముట్టడించి మహాయుద్ధంబు గావించి భ్రాతృపుత్రమిత్రపరివారపరివృతుం డగురావణాసురుని సంహరించి విభీషణుని లంకారాజ్యంబునం బట్టభద్రుం జేసి సర్వపరివారపరివృతుండై సీతాదేవితోఁ బుష్పకవిమానం బెక్కి భరద్వాజాశ్రమంబు మీఁదుగా నయోధ్యాపురంబునకుం జని రాజ్యపట్టాభిషిక్తుండై సుగ్రీవాదులకు నానావిధబహుమానంబు లొసంగుచుఁ జంద్రప్రభం బగు నొక్కముక్తాహారముం దీసి సీతాదేవి కిచ్చి తక్కినవారిం దగునట్లు సత్కరించె నప్పుడు సీత రామచంద్రుండు తన కిచ్చినహారంబు చేతం బట్టుకొని హనుమంతుం జేరఁ బిలిచి. 105

శా. నాప్రాణేశ్వరు వార్తఁ దెచ్చి చెవికిం బర్వంబు గావించియున్
నాప్రాణంబులు నిల్పినట్టిఘనుఁడై నాప్రాణబంధుండ వై
సుప్రీత్యం దగునట్టినీ కిదిగొ జిష్ణుం డీయఁగా నైన ది
వ్యప్రోత్తం బగుతారహారమును నే నర్పింతుఁ గొమ్మో హరీ. 106

వ. అని దాని వానిహస్తంబునం బెట్టిన నంతలోన. 107

మ. హనుమంతుండు రమార్పితంబును వరం బైయొప్పు హారంబునన్
ఘనమౌ నాయకముం గ్రహించి పగులం గా నల్పు చుండఁగ నే
మని సుగ్రీవుఁడు ప్రశ్న సేయుటయు నిం దారామనామంబు నుం
డెనో లేదో యని చూడ నిట్లునలుపన్ నే నెంచుచుంటిం జుమీ 108

తే. అనుడు సుగ్రీవుఁ డనియె నోయాంజనేయ
ఛాతిలో అప్పలోపల రామనామ
ముండు నని యెంతె నీలోన నుండు నోయి!
చెప్పు మనుటయు హనుమంతుఁ డప్పు డడరి. 109

చ. తనహృదయంబు గోళ్లల నుదారతఁ జీటి కనుం డటంచుఁ జూ
పిన నట నున్నయెల్లరును వేడుకఁ జూచిరి సూర్యపుత్రుఁడున్
హనుమశరీరభాగ మది యంతయు రామమయంబుగాఁ గనుం
గొని కడు విస్మయంపడుచుఁగౌఁగిలిచెను రాముని బోలె నాతనిన్.

తే. రాముఁ డాతనిభక్తికి రక్తిఁ గెంచి
నాచరిత మెంతకాలము దోఁచుచుండు
భూతలంబున నీ వంతకాలము మని
యవల సామ్రాజ్య మొందుదు వని వర మిడె. 111

క. నీమది బ్రహ్మత్వంబును
గామించె నెఱింగియుంటిఁ గాలాంతరమం
దామహితాశయములు నీ
కామెయి లభియింపఁ గలుగు నని వర మిడియెన్. 112

ఆ. ఆవరంబువలన నంతకాలంబును
వర్షమ్రిాఁగ నట్టివాఁడ యగుచు
సంచరించు చుండు భూమండలమునందు
ననుచుఁ దెలియవచ్చు ననఘులార. 113

శా. దీనం జేసి యెఱుంగ వచ్చెడి మరుద్దేవాత్మజాంగంబులన్
గాన న్వచ్చెడురామతారకలిపుల్ గన్గొంటిరే వింటిరే
సానందం బగు నాంధ్రదేశమున దివ్యాద్రీంద్రమైవాయుజుం
డీనాఁట న్వెలుగొందుచుండుఁ దపమున్ హేమింపగాఁ జేయుచున్.

కపిరాద్రి ప్రభావము.

క. పంచక్రోశక్షేత్రి మ
దెంచం గాశికను మించు నేమో యంచున్

గించులకుఁ దెలియకుండిన
సంచితపుణ్యులకుఁ దెలియు జిహ్మభృన్మహిమల్. 115

శా. ఆకపిరాద్రిసానువుల నన్నిటియందును రామనామమే
లోకనుతప్రభం గలిగి లోచనగోచరమై తలిర్చెడుఁ
శ్రీకపిరాజశేఖరునిచిహ్నము లచ్చటఁ బోల్చ వచ్చెడిన్
వాకొనుచుంటి నా తెలియవచ్చినమచ్చున మీకునిచ్చటన్. 116

శా. పాతాళాపగ మీఁది మీఁది కచటన్ పాఱంగ నేతెంచుచో
నాతత్త్వజ్ఞుఁడు వాయుజుం డెఱిఁగి తత్ప్రాంతంబునం బర్వతం
బైతళ్కొత్తియుఁ దేవతాత్ముఁడగుచుం బ్రాంచన్మహామూర్తియై
ప్రీతిన్ భక్తుల నేలువాఁడ యగుచుఁ బెంపొందునీనాఁటికిన్. 117

వ. అని నారదుండు ధర్మరాజాదులకు హనుమజ్జన్మప్రకారాదికం
బును వానివిజయంబును శ్రీరామచంద్రుని వరప్రదానంబును
గపిరపర్వతంబై తపంబు సేయుచుంటయు లోనగు నుత్తమకథా
వృత్తాంతం బెఱింగించె నని చెప్పిన నైమిశారణ్యవాసు లవ్వలి
వృత్తాంతంబు చెప్పు మని సూతు నడుగుటయును. 118

ఆశ్వాసాంతము.

గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ, వేదవిద్యావిశారద, ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, ప్రసన్నవాల్మీకి, అపరబృహస్పతి, విశ్వకవి ప్రముఖబిరుద విరాజమాన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతంబైన ప్రసన్నాంజనేయప్రభావం బను మహాప్రబంధంబునఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

# కపిరగిరిచరిత్రము

## ప్రసన్నాంజనేయ ప్రభావము

### తృతీయాశ్వాసము

---

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. నట్లు నార
దుండు చెప్పిన విని ధర్మరాజాదు లత్యంతానందభరితాంత
రంగులై రప్పుడు మరున్నందనుండు. 1

శా. నాతోఁబుట్టువు నాకు నేడుగడ నానాశాస్త్రవిజ్ఞుండు లో
కాతీతప్రతిభావిశాలుఁ డగుచున్ హార్వ్యాందుసమ్మారుతిన్
జేతోమోద మెసంగఁ జూచుటకు నేఁ జిత్తంబు గావించితిన్
బ్రీతిం గూర్చెను నారదర్షివరవాగ్రీతుల్ ప్రవర్తిల్లుటన్. 2

వ. అనిన నానందసంభరితహృదయుండై విజయుం డిట్లనియె. 3

శా. నాకేత్వగ్రమునందు నుండి యెప్పుడైనం గాని నే నన్యథా
పీఁకం బోవుచునుండఁ గా దనుచు శ్రీవిం దెల్పిన ట్లార్చుచున్
నాకం బెన్ మునుమున్న శాత్రవునిప్రాణం బూడిపోఁ జేయుచో
నాకై యాడు ననంతరంబున నె బాణంబుం బ్రయోగింపఁగన్. 4

ఆ. టెక్కియంబునందు నెక్కి రణంబుల
విజయ మొసఁగి నాకు విజయనామ
మొసఁగినట్టితండ్రి నోంకారరూపు నేఁ
జూడ నెంచినాఁడ వేడుకమెయి. 5

వ. అంత ధర్మజుండు ధౌమ్యాదులదిక్కు మొగంబై యిట్లనియె. 6

## ధర్మరాజు విశ్వజిద్యాగసంకల్పము

మ. హనుమంతుండు తపించుచోటి నటువ్యాఖ్యానంబుగావించుటన్
మునివర్యుం డది యుత్తమోత్తమము సంపూజ్యంబు దివ్యస్థలం
బనియు న్విశ్వజిదధ్వరం బచటఁ గృష్ణానుగ్రహం బున్న నేఁ
బొనరింపం దలపోయుచుంటిని మహోద్యోగంబు లోమూగఁగన్.

వ. అనంతరంబు ధౌమ్యుండు ద్వైపాయనాదులు విన నిట్లనియె. 8

తే. విశ్వజిద్యాగ మటఁ జేయ విశ్వఫలము
సంభవించెడు ననుమాట సత్య మగును
గాని విపినప్రదేశము గానఁ గష్ట
తర మని తలంచుచుంటి న త్తలమునందు. 9

వ. శ్రీకృష్ణుండు కృష్ణానుమతంబున నిట్లనియె. 10

శా. ఏ నావాయుతనూజునిం గనఁగ లే దేనాఁడునుం గాని నా
తో నాడం దలపోయునో కనుఁగవం దోపంగ నై యుండునో
కానీ క్షేత్రము పాత్రమాహరికృపం గావింప మే లయ్యెడిన్
మానిత్రాతము నాదువాక్యముల కేమాడ్కిన్ మతిం జేయునో.

వ. అని కృష్ణుండు వాక్రుచ్చినంతఁ గృష్ణద్వైపాయనుండు బ్రహ్మా
నందభరితాంతరంగుఁడై లేచి లోలోనఁ గృష్ణు నభినందించుచు
ని ట్లనియె. 12

ఉ. వాయుసుతుండు నన్నుఁ గని పల్కునొ పల్కఁడొ నేను జూడ లే
దాయన నంచు సంశయము లాడె మరుత్సుతుఁ డప్పు డిప్డు నె
ప్డీయదునందనున్ గనుచు హృజ్జలజంబున నిల్పి కొల్చుచున్
బాయనిభక్తిమై మెలఁగువాఁ డని యాతఁ డెఱుంగ కుండునో.

చ. ఎఱుఁగు సమస్తమున్ దమకు నెప్పటిభక్తుఁడొ యెవ్విధంబునన్
నెఱిగలఁడై భజించెడినొ నీరజలోచనుఁ డారఘూద్వహుం

డఱమరలేక తా నయితి నంచు నెఱింగి ప్రతీకారణంబు లి
గ్గఱిమ వచింప వచ్చెడి నిఁక న్వచియింపఁగ నేమి యుండెడిన్.

వ. అనిన నారదుం డానందం బభినయించుచు నెల్లప విన ని ట్లనియె.

ఉ. క్షేత్రము మంచి దాసవము చేతఁకు వాయుతనూజు ప్రోపు నా
గోత్రమునందుఁ గల్గెడినిఁ గొందఱు గా దలవిశ్వజిత్తునన్
ధాత్రిఁ గలట్టివా రితరధాతులఁ గల్గినవార లందఱున్
సత్రమునన్ భుజింపఁ దగు సర్వజనాశయ మద్దియొక్కటే. 16

వ. అనిన నజాతశత్రుండు గడగడ వడంకుచుఁ గృష్ణాదులదిక్కు
మొగంబై వెండియును. 17

మ. ఉబలాటం బది యుండు నెల్లరకు నాకో లేకపోలే దిలం
కబుసుం గాంచినదాసనం బఖిలలోకంబుల్ దినం జెల్లు నం
చుబు సీనారదమౌని దెల్పె హరిగా కొక్కండు నే నంచు వా
కుబడిం జేయ సమర్థు డుండఁ డని నాకుం దోచు నిప్పట్టునన్. 18

వ. అని యూరకున్నంత సాత్యకి సభామధ్యంబున నుండి లేచి సభా
సదు లాలకింప ని ట్లనియె, 19

శా. నేను న్నాదుగురుండు భీముఁడు గవల్ నిత్యానసాయంబుగా
నానందంబుననుండి జన్నమునయుం డానెల్లసంభారముల్
ధ్యానం బయ్యెడునంతలోన సమకొల్పం జాలి యున్నార మో
మౌనీంద్రోత్తములార! శంక విడ సంప్రార్థింతు మే మిత్తఱిన్.

వ. అనినంత నారదాదులును ధర్మరాజాదులును గృష్ణవాక్యంబుల
కెదురు సూచుచున్నంత సభాసదుల యభిప్రాయం బెఱింగిన
వాఁడు గావునఁ గృష్ణుండు ధర్మరాజుదిక్కు మొగంబై విగత
సందేహుం గావించుచు నిట్లనియె.

శా. బావా! నేఁ గల నాదుతోడు గల దీభాగ్యానికిన్ నెమ్మదిన్
జేవం దక్క మెలంగ నేమిటికిఁ దత్క్షేత్రంబునన్ జన్నమున్

శ్రీ వర్ధిల్లఁగఁ జేయు మన్న మిడి యీరే డైనలోకంబులం
దావాప్ తృప్తి వహింపఁ జేయుటకు నేనై భారముం బూనుదున్.

వ. అంతలోఁ గరతాళధ్వనులు మిన్నుముట్ట నెల్లరు నౌ మే ల్మే లని ప్రస్తుతించిరి. నారదద్వైపాయనాదులుం బ్రశంసించి రప్పుడు కృష్ణుండు భీమార్జున నకులసహదేవ సాత్యకిప్రద్యుమ్నానిరుద్ధాదుల దిక్కు మొగంబై మీ రెల్లరును నానాదేశంబులకుం జనియు వేగులం బుచ్చియు బ్రహ్మక్షత్రియవైశ్యజాతుల నందఱ యజ్ఞంబునకు నాహ్వానంబు చేయ వలయు దేవలోకంబులకును మనయాహ్వానంబు చేరవలయు నంత వచ్చినవారి కెల్ల నుచితోపచారాపచితులు సలుపవలయు. బ్రాహ్మణాదిసమారాధనంబునకు మీ రేమియుం జేయ నక్కఱలేదు. గాని భోజనపాత్రసంపాదనంబును వారము వారము భుజించువారికిఁ బంక్తులు తీర్చి భోజనపాత్రంబులు వేయుటకుం గొన్నివేలమందిని నియమింప వలయు నుచ్ఛిష్టసమ్మార్జనంబునకు నాయాజ్ఞం జేసి పురుషమృగంబుం దెప్పింప వలయు. మఱియు హాస్తినాపురంబునందును ద్వారకాపురంబునందును వ్రజంబునందును గలమనబంధుసందోహం బంతయు ధర్మజానుమతంబున యజ్ఞాయతనంబునకు రప్పింప వలయు నని చెప్పుచు మయుం దలంచెఁ దలంచినంతే నతండు చేడకట్టిన వానిం జూచి యోయి వృషపర్వశిల్పివర్యా! నీకై తలంపు చేసితి నంతలో నీవు వచ్చితివి సంతోషం బయ్యె మన యుధిష్ఠిరుం డాంధ్రదేశంబునం గలకైలాసపర్వతసమీపంబున విశ్వజిద్యాగంబు చేయ నెంచె నట నాపంచపంచక్రోశముల ప్రదేశంబునందును ధౌమ్యాదిపురస్సరంబుగ యజ్ఞశాలలు యథాశాస్త్రంబుగ వేయించుటయు కాక సర్వవర్ణసముచితమ్ముగ భోజనశాలలు కొన్నికోటు లొక్కపరి కూరుచుండి భుజించుటకుం

దగునట్లు నొకపంక్తినుండి మఱియొకపంక్తికిం బోవుట కనువు పడునట్టిమార్గంబులును బ్రతిమార్గంబునందును ప్రతిస్థలమ్ము నందును విద్యుద్దీపములు నెలకొనియుండునట్లును బ్రతిచత్వరంబు లందును నీళ్లగొట్టములు నిలువరించి వానియందు జలం బెప్పు డును దఱుఁగకుండు నట్లునుజేయ వలె నింతియకాక దేవయజ నంబున దేవళ్లు నివసించుట కనువుపడున ట్లున్నతప్రదేశంబులు వేఱువేఱుమంచంబులతో హంసతూలికాతల్పంబులతో నలంక రించి యుండునట్లును సంగీతసాహిత్యాదిసభలకును దేవతా నృత్యసభలకును విశాలశాలంబులు పటకుటీరంబులు రాజ గృహారాజంబులు సృజింపవలయు మఱియు దేశాధీశ్వరులు లోనగువారికి గృహంబుల నానావిధాసనంబులు నంచన్మంచం బులు నుండునట్లును బ్రతిగృహంబునందును బ్రతిస్థలంబునందును యంత్రంబులు వీవనలై సుఖవాయుప్రసారంబు చేయుచుండు నట్లును మఱియు నాయాస్థలంబుల నేయేసౌకర్యంబులు గావ లయు నవి యన్నియు ననువుపడునట్లు సలుప వలయు నని మఱియును. 23

చ. ఫలములు లడ్డుకంబులును బానకముల్ మధుమద్యపేయముల్
గలిగినయంగడుల్ జనులు కాలిమఁబోటుల నుండునట్లు గా
వలసినవాని నెల్లరును వచ్చి గ్రహించెడునట్లు చేయుచున్
మెలఁకువతో మెలంగఁ గలమిత్రుల నత్తఱి నిల్పగాఁ దగున్. 24

సీ. స్నానపానాదుల శాలలును విహార
భవనంబులును జాల వలయు నచట
వైద్యశాలలు నాల్గువెపుల నెలకొల్పి
వలయుమందుల నిచ్చువైద్యుల నిడి
నలుతట్టులం దుండి కలసి వచ్చెడువారి
నాదరించెడువారి నందఱ నిల్పి

ప్రతిదేశవార్తలు ప్రతిఘటికకుఁ దెల్పు
శాల లందందు నెసంగఁ జేసి

తే. కడగి స్వాహా స్వధా వషట్కారములకు
మఘమునం దగుకర్మాదిమంత్రములకు
నర్థములు చెప్పి పోషలింప నైననారి
నచట నిలుపంగ వలయు నోయసురశిల్పి. 25

క. రక్షకభటుల నచటఁ బ్రతి
కక్షంబున నిలుపదించి కనుగొని తప్పుల్
శిక్షింపఁ జేయుపనికిన్
రక్షించెడుపనికి వలయు రమణించుటకున్. 26

క. మణిమంత్రౌషధసిద్ధుల
నణిమాదుల నెఱిఁగినట్టియార్యుల నచటన్
క్షణము క్షణంబును గనఁగ వి
చక్షణులన్ గోరి నిలుపఁ జను నవ్వేళన్. 27

సీ. ఇట నుండి యటకు నచ్చటినుండి యిచటికి
రాకపోకలు సేయు రమణ మెఱయ
దేవయానంబులు దివినుండి తెప్పింపు
మవి సహస్రము వేయునట్లు వలయు
నింగి నెచ్చట నిల్పి నిలిచెడునట్లును
నేల నెచ్చట దింపఁ బోలు నట్లు
భయ మొప్ప లేనట్లు బహుయంత్రసామగ్రి
లలవడియుండెడు నట్లు మఱియుఁ

తే. పడకటిండ్లును మంచముల్ ఫలచయంబు
మార్గములు గాలి గలిగెడుమాద్రి నుండి
సర్వసౌకర్యములతో నెసంగు నట్లు
చెన్నమరి యుండవలె నోయిశిల్పివర్య. 28

అని మఱియుం జెప్పఁ గలపను లన్నియుం జెప్పి నేఁటికిఁ బదు
నైదుదినములలో యజ్ఞసంకల్పం బగుం గావున నాఁటి కన్నియు
సంసిద్ధంబు గావింపు మనిన నతండు మహాప్రసాదం బని ధర్మ
రాజాదులకుం జెప్పి పోయె నంతఁ గృష్ణుండు తనవారి నంపఁజ
విశ్వజిత్తునకు రా వలయు నని వార్తం బుచ్చి, పోయి వత్తు
మన్న నారదాదుల నాఁటికి రాఁ జెప్పి యంపిపుచ్చి ధౌమ్యా
దులం గూడి యజ్ఞోపకరణంబులు యథాశాస్త్రంబుగం జేయిం
చుచు ఋత్విగ్వరుల నాహ్వానించి ధర్మరాజుతో నిచ్ఛావిహా
రంబు గావించుచుండె నంతలోఁ గ్రమక్రమంబున దేశంబులం
గలరాజులు బ్రాహ్మణులు లోనగువారును జగంబునం గలముని
ముఖ్యులును సమాగతు లైనంత వారికి నకులసహదేవసాత్యకులు
యథోచితసత్కారంబులు గావించి రంతలో మయుండును యజ్ఞా
యతనంబు లన్నియు సమకట్టి చెప్పినచో స్థాపనం జేసి దేవమా
నంబులం దెచ్చి విన్నవించె నంత నారదాదులును గృష్ణద్వైపా
యనాదిమునిముఖ్యులుం జనుదెంచి రప్పుడు దేవదేవుండు ధర్మ
రాజానుమతంబున విదురసంజయాదులను గాంధారీధృతరాష్ట్రు
లను ద్రౌపదీప్రముఖరాజపత్నులను ద్వారకాపురినుండి వచ్చిన
వారిని నట నుండువారి నందఱ వేఱు వేఱు విమానంబు
లెక్కించి తాను ధర్మరాజభీమార్జుననకులసహదేవుల తోడం
గూరుచుండె మంగళవాద్యంబు లెసంగఁ బొసంగిన శుభముహూ
ర్తంబున ఘంటానాదం బాలకించి దివ్యవిమానంబు లన్నియు
మయప్రబోధితంబులై కదలి మందగమనంబునఁ గిరిగిరికిం
బ్రయాణం బయ్యె నంతలోన విమానంబులు వారణాసీపురీపరి
సరంబునకుం బోయి యున్నయప్పుడు భీమసేనుం డంగుళిసంజ్ఞం
జూపుచు నన్నకి ట్లనియె.

*శా. అన్నా! చూచితె లింగకోటు లవి నేత్రానందముం గూర్చుచున్
నన్నుం బట్టగ నున్న సాళ్వమునకున్ గాకుండఁ దప్పించుకో
నన్నన్ మొఱ్ఱిక్కుచు లోమములన్ విసరివేయన్ దివ్యలింగంబులై
కన్నుందోయికిఁ దోప నాశ్చర్యము వేష్యంగాల్చెన వ్యాళినిన్. 30

వ. అంతలో నేను దానిబారిం దప్పించుకొని నీపాలం బడితిని నను చుండ విమానంబులు బలిఘట్టం బను బ్రహ్మలింగేశ్వర క్షేత్రంబు నకుంజనుదెంచె దాని క్షేమసేనుండు నిలకించుచుండఁ గృష్ణుండు దీని నీ వెఱుంగుదె యనిన క్షేమసేనుండును. 31

ఉ. పచ్చలు కోటిఁ గోటు లయి పర్వతభాగములందు నేటిలో
వచ్చుచుపోవువారిపరివశ్యల నందుచు లింగపంక్తులై
ముచ్చట గూర్చు నవ్వి కపిపుంగవువాలతనూరుహాంబు లే
వచ్చుచు నాఁడు పూరుషునివాతికిఁ గా కిటుఁ జల్లితిం బ్రభూ. 32

సీ. ఇది బలిఘట్ట మన్ పడ మిందు బలి మున్ను
తపము గావించె నీధరణియందు
పాతాళముననుండి పఱతెంచె నిది వరా
హానది తద్దంతఘట్టనమున నయః
వారాహనది యుదగ్వాహినియై యిట
నవిముక్తమునకు నెత్తగుచు నుండు
బ్రహ్మ ప్రతిష్ఠించెవరలింగ మిచ్చట
ము న్నొకయజ్ఞము పొస్తఁగఁ జేసి

---

* సాళ్వము = పక్షివిశేషము; పురుషమృగ మీసాళ్వజాతిలోఁ జేరినది. గరుత్మంతునికివలెనే కాలుసేతులుండుటయ కాక ఱెక్కలు నుండును. వజ్రదంష్ట్రలు గలిగి భయంకరముగా నుండును.

తే. బహ్మలింగేశ్వరుఁడు నదీపార్శ్వమున
పశ్చిమముఖంబుగా నుండు భక్తవత్సల
కొంగుబంగారమై యిది కోటిలింగ
ములను గలిగినక్షేత్రమై వెలయుచుండె 33

వ. అంతలో దేవయానంబు లంతరిక్షంబునఁ గపిరాచలక్షేత్రంబు దరియ వచ్చినట్లు ఘంటానాదం బాలకించి యెల్లరు నత్యుల్లాసంబు నం జూచుచుండఁ జుక్క దెగిపడ్డవిధంబున విశ్వంభరాతలంబున కవతరించినంతలో నందలివారు విమానంబులనుండి దిగి వారి వారి నామాంకితంబు లగుప్రదేశంబులందలి గృహంబులకుం జని విశ్రమించిరి. విమానంబులును వెనువెంటన మిన్నంటి తక్కినవారి నెక్కించుకొని రాఁ జన నవంతరంబ వాయు పుత్రుండు. 34

మ. తనయన్నం గనుఁగొనఁగ నాత్రపడుచున్ దమ్ముల్ తనుం బిల్చుచో
వినఁగా నోల్లక మాఱు వల్క కచటన్ విఖ్యాతభూభాగముల్
చని యెందుం గనఁ జాల కార్తిఁ గలఁడై స్వాంతబునం గుందుచున్
మును గన్గొన్నప్రదేశముం దెలిసి సంపూర్ణస్వరం బేర్పడన్. 35

వ. ప్రాఙ్ముఖంబున నిలిచి చేతు లెత్తియుఁ దత్తఱంబునుం బ్రది ర్శించుచు. 36

శా. ఓహో వాయుతనూజ! యోవరద! యోయోగీంద్రరాడ్ధ్యేయ! యో
హోహో రఘురామభక్త! దళితాంహోరూపసంసారసం
మోహా! యోనను గన్నతండ్రి! కరుణాంభోరాసి! యెందుంటివో
హోహో భీముఁడ వేఁడుచుంటిఁ గన రావా! నన్ను నీదాసునిన్. 37

క. భృగుపాతంబున నిప్పుడ
సుగతిం గనఁ బోదు నీదుశోభనమూర్తిన్
దగఁ జూడకున్న ననుచుం
దెగువ మొయిం జాలఁ బడగఁ దివిరినయంతన్.

తనితమ్ముం డగువాని కెక్కియమునం దళ్యోక్తి జన్యంబునన్
ఘనతేజంబు జయంబు గూర్చితివి నిన్ వర్ణింప సామాన్యమే.

క. ఆలోన కేలుదోయిన్
ఫాలంబునఁ జేర్చి నేన ఫాల్గుణుఁడను నా
పాలఁ బ్రసన్నుఁ డగుని
న్నే లలి వినుతింపనేతు నే నల్పతి నయో. 44

వ. అనిన నాంజనేయుండు వానిం జెంతకు రమ్మని శిరంబుపైఁ
గరంబు వెట్టి మోముమంక మోము ద్రిప్పిచూచు చు. 45

చ. అలఁతివ నీవు మే ల్బళి! య దంతయు వింతగ నే నెఱుంగుదున్
జలమున మాయబోయ నొకచక్కిన చెక్కుమడంచి తక్కటా
తెలిసెను గాలకేయులకు దేవపదంబునయందు నీభుజా
బలము వచింప నేమిటికి భక్తుఁడ నంచు నుతింప నిన్నికన్ 46

ఆ. అంతలోన నెదుటఁ బ్రాంజలియై యున్న
ద్రుపదరాపుత్రి దొడ్డతనముఁ
దెలిసి వహ్నియందు వెలసి వెలింగెడు
నాదిశక్తి యీమె యగును దెలియ. 47

క. అని పలుకుచుండుతరుణా
బునఁ గృష్ణుఁడు భోజపుత్రి మునుగొని యెదుటం
గన వచ్చినంత మారుతి
వినయమునన్ లేచి కనుల వెడలఁగ జలముల్. 48

వ. వడిన్ వడిం బఱచి వారిపాదంబులపై వ్రాలి లేచి చేతులు జోడిం
చుకొని. 49

శ్లో. నమ స్తే రామచన్ద్రాయ, నమ స్తే లోకబాంధవే
నమ స్తే దేవదేవాయ, నమ స్తే దుఃఖహారిణే. 50

శ్లో. మాతా మరకతశ్యామా, మాదేవీ జనకాత్మజా
మామవ త్వనిశం పుత్రిం, పద్మా పద్మాలయా౽రమా. 51

వ. అని మఱియును. 52

శా. బ్రహ్మణ్యుల్ సనకాదియోగివరు లేపద్మాక్షునిం దారక
బ్రహ్మం బంచు నెడం దలంచెదరొ శ్రీరామాహ్వయుం డాపర
బ్రహ్మం బియ్యెడ నన్నుఁ బ్రోచుటకునై ప్రత్యక్షముం జేసె నే
జిహ్మత్వం బెడఁబాయ మ్రొక్కెద సదా చిత్తంబునన్ భక్తిమై.

సీ. ఖలు లగుతాటకాదుల రక్కసుల గిట్టి
కౌశికుజన్నంబు గాచె నెవఁడు
గౌతమమునినాతి జాతిరూపముఁ బాసి
వెలఁదిగా వేడ్కఁ గావించె నెవఁడు
వేగు రెత్తగ లేని విశ్వేశ్వరుని విల్లు
నడఁచి జానకిఁ బెండ్లియాడె నెవఁడు
లీలమైఁ బితృవాక్యపాలనాశీలుఁడై
మునులఁ బ్రోవఁగఁ బోయె వనుల కెవఁడు

తే. శబరియెంగిలి గుడిచి తా సాకె నెవ్వఁ
డడరుఖరదూషణాదుల నడఁచె నెవ్వఁ
డట్టినీకు నమస్కారము లాచరింతు
రమ్యగుణధామ! సుజనాభిరామ! రామ. 54

క. ఇన్నాళ్ళకు నినుఁ జూచితిఁ
గన్నులు గలుగుటకు నేఁడు గా ఫల మయ్యెన్
బన్నములఁ జివుకనీయక
న న్నోమవె రామనామ! నయగుణధామా. 55

వ. అంతలో నింతదూరంబున నున్నసత్యాదికాంత లాకపిరాజుం
గాంచి వారిలో వారు. 56

సీ. పుట్టినప్పుడె యినుఁ బట్టి మ్రింగఁగఁ బోవె
గడిమి నీకపిరాజు కాంతలార
మున్నీరు గోష్పదంబుగ నొక్కలంగమై
దాఁటెనీ మారుతి బోటులార
యక్షాదిదనుజాళి నక్షీణబలమున
శిక్షించె నీహరి చెలియలార
సీతాంగనావార్తఁ జెప్పె శ్రీరాముని
నెగడించె నీమణి నెచ్చెలులార

తే. సమరమున రావణాసురుశక్తి వలనఁ
బొలియ నున్నట్టి లక్ష్మణమూర్తి నితఁడు
ధైర్య మలర సంజీవినిశిఖరవరంబుఁ
దెచ్చి బ్రదికించె నమ్మరయో తెఱవలార. 57

మ. కలిమిం దొలఁగినప్డు వేఁగురది పోఁ గన్పట్టఁ డొక్కండు నీ
లలితాంతఃకరణుండు సూర్యసుతునిన్ లక్షించి పాయుండు కొం
దలముం జెంది గతార్థుఁడైన వానితోఁ దా సఖ్యముంగూర్చి వ
ర్ధిలఁ గాఁ జేసె నమాత్యుఁడై భటుఁడునై దేవుండునై చుట్టమై.

క. ఇతఁ డింతటినమ్మకమున్.
బ్రతిభయునుం గార్యసాధనంబు నతి సమ
ర్థతయుఁ గలాఁ డని కాదే
క్షితికన్యకు నుంగ్రమంపె శ్రీరాముఁ డహో! 59

సీ. ఉదధిమధ్యమునందు నొదవిన గొడవెల్ల
గొరాడి పారముఁ గాంచినాఁడు
లంకఁ జేరఁగనీక యుంకించి పెనఁగిన
కూళ లంకను లీలఁ గూల్చినాఁడు

కడుప్రయాసము నొంది పుడమికన్నియఁ జూచి
యెఱుకకై మానిక మిచ్చినాఁడు
అక్షీణజవమున నక్షాదులను గూల్చి
చేరి రాక్షసరాజు దూఱినాఁడు
తే. వడిగఁ జూచి రమ్మనఁ గాల్చి వచ్చినాఁడు
మెచ్చ రాముఁడు సతివార్తఁ దెచ్చినాఁడు
వసుధఁ బరమోప కారస్వభావుఁ డితఁడె
యితని వర్ణించుటకుఁ జాల రెవ్వరైన. 60
క. ఎచ్చట నో దవ్వుల విన
వచ్చెడుద్రోణాద్రిఁ దెచ్చి పాపుశక్తిన్
జచ్చెడులక్ష్మణుప్రాణము
లిచ్చె నితం డితనిమహిమ యెఱుఁగం గలమే. 61
వ. అని యాదఱు నన్నిచందంబులం బ్రశంసించుచు సంతసించుచుండి రప్పు డట్లు ప్రార్థించి హనుమ రుక్మిణీకృష్ణులపై దృష్టి నిగడించి. 62
శా. వేలబ్దంబులు సెల్లె నిప్పటికి నన్ వీక్షింపగాఁ జిత్తమై
యీలీలం జనుదెంచియుండు రఘువంశేశాన! మాతల్లి కే
సీలోఁ గింకరుఁ డున్నమాట యెఱుఁగన్ హృద్వ్యాధికిన్ రానిపై
కాలంబుం గడతెర్చె నే మనుచు నాకష్టంబు వాక్రుచ్చెదన్. 63
క. ఏకాలంబున కేనియుఁ
బాకొందును నిన్ను మఱచువాఁడను గానం
జాకరణి మఱచియుంటివి
ఏకేమని విన్నవింతు నీరజనాభా. 64
వ. అని హనుమంతుండు వారిపాదంబులం బడి ప్రార్థించుచున్నంతఁ బూర్వజ్ఞానంబు గలదై రుక్మిణీదేవి హనుమశిరంబుపైఁ గరంబు పెట్టి కంట నీరుపెట్టుకొనుచు ని ట్లనియె. 65

సీ. అన్న నీకా మఱతునే యెన్నఁటి కైన నే
నాత్మహత్యం జేయునవసరమునఁ
బ్రాణరక్షణ మీవు ప్రత్యక్షమై చేసి
తివి రామవార్తను దెలియఁ బలికి
రక్కసిమూఁకలు రావులఁ బెట్టంగఁ
దాళఁ జాలకయున్న తరుణమందుఁ
నల్లి నాయఱకడఁ దగ నుండు మే మోసి
కొనిపోదు వేల్మిడి నని వచించి

తే. తెన్నియో ప్రియవాక్యము లెఱుగఁ జెప్పి
ప్రాణములు నిల్పుకొను మెట్టులైనగాని
రామచంద్రునిఁ దెచ్చియీ రాక్షసులను
దునిమి శుభమునఁ గూర్తు నం టనిలతనయ. 66

ఆ. అట్టిప్రాణబంధు వైనసీపై నాకుఁ
గాని రామమూర్తి కైనఁ గాని
యన్యభావ ముదయ మా నని తలఁచుట
వెఱ్ఱితనము సూవె పిన్నవాఁడ 67

వ. అని రుక్మిణి పలుకుచుండఁ గృష్ణుండు వాయునందనా! యీపాండ
వులు నాకు నీవలెం బరమభక్తులు వీరిలో నగ్రజుం డగుధర్మజుం
డీక్షేత్రంబున విశ్వజిద్యాగమ్ము చేయ నెంచి వచ్చె నీ వీకాల
మ్మున నన్నును వీరిని వీరిజన్మంబును గాచుకొనియుండు మేము
మాపొందుపట్లకుం బోయి విశ్రమింతుము నీకు ననుష్ఠానవేళ
యతిక్రమించుచున్న దని హనుమంతుని వీడ్కొలిపి వా రందఱు
వారివారిగృహంబులకుం జని రాంజనేయుండు నంతలో నంత
ర్ధానంబు నొందె నంత నామఱునాఁడు. 68

సీ. వేఁకువన్ ధౌమ్యుఁడు వెస లేచి మును మున్న
ధర్మరాజాదులఁ దవిలి లేపి
కాల్యకృత్యంబులు గడచేఁ గాఁ జేసి
స్నానసంధ్యాదు లెసంగఁ జేసి
నిత్యాగ్నిహోత్రమున్ నెఱవేర్చి విశ్వాజి
ద్యాగసంకల్పము తగ నొనర్చి
ఋత్విద్వరణ మప్డు ఋజుగతిఁ గావించి
శాలావిహారణంబు సలిపి మీఁద

తే. దీక్షణీయేష్టి చెల్లించి దీక్షితుఁడును
దీక్షితాంగన నూత్నవస్త్రక్షతాదు
లను ధరించిరి లేజితో లును విషాణ
మును ధరించెను దీక్షితుం డనువు మీఱ. 69

ఉ. దీక్షితపత్ని యోక్త్రమును దేహము నంటెడునట్లు మధ్యమం
దక్షయసౌహృదంబు సుభగాతిశయంబు ప్రజాప్రవృద్ధియున్
రక్షణమున్ లభించెడు తెఱంగునఁ దాలిచి శిక్య మాదలన్
సుక్షమ గల్గునట్లు తలఁ జుట్టెను గొప్పును బట్టి యుండఁగన్. 70

సీ. అంతఁ బ్రవర్గ్యము నాచరింపఁగ నెంచి
యధ్వర్యుఁ డా బ్రహ్మయాజ్ఞ వడసి
హోత! ధర్మము చెప్పు మోయి యాగ్నీధ్రుఁడ!
రౌహిణంబుల నిల్పు విహారపాదల
నో ప్రతిప్రస్థాత! యుచితరీతి మెలంగు
మోయి ప్రస్తోత! కాలోచితముగ
సామగానము సేయు మో మహితాత్ములు!
ధేన్వజక్షీరముల్ తెలిసి తెండు

తే. నే సుతప్తఘర్మాజ్యములోన వాని
మంత్రపూతముగా నుంచి మాట లెసఁగ
నాజ్య మాహుతిఁ గావింతు నగ్నిహోత్ర
మునఁ బ్రవర్గ్యోక్తమంత్రసముదయమునను. 71

వ. అని ప్రేషము గావించి మించినవేడ్కఁ బ్రవర్గ్యవిధానంబు
నిర్వర్తించె ననంతరంబ. 72

క. పదిఘటికల య్యె భుక్తికి
నద నయ్యె నటంచుఁ బ్రజలు యజ్ఞావనిలోఁ
దుద మొదలు లేని తెఱఁగున
వెదకి మహానసము నాల్గు వీథులయందున్. 73

ఆ. వంట లేదు మొదట వంటయిల్లే లేదు
నిప్పు లేదు ప్రొయ్యిచొప్పు లేదు
కోటికోట్ల ప్రజలు కూటికి వేచి యుం
దున్నవారు భుక్తి యున్నదగునె. 74

ఆ. భోజనప్రధాన మగుజన్న మిది యని
నారదుండు చెప్పె నలిననాభుఁ
డేను గలను దాని కేను నక్కఱ లేదు
నాది ప్రాచి భోజనాదులకును. 75

క. అని చెప్పెఁ గాని చెప్పిన
ఘనవాక్యము వెంట వంటకము లెచ్చోటన్
గన రావు ప్రజకు నుపవా
సనిమిత్తమ తోఁచుచుండె సవనమునందున్. 76

వ. అని యందఱు నన్నిచందంబులం బలుకుకొనుసమయంబున
ఘంటానాదం బయ్యె ననంతరంబ. 77

సీ. పదివేలభోజనపాత్రముల్ పంక్తులఁ
దీరిచి వేసి రాధారణిపయిఁ
బంక్తు లిన్ని న్నని పల్కశక్యము గాదు
పదిక్రోశములమేరఁ బట్టియుండె
నొకపంక్తినుండి వేఱొకపంక్తికిం బోవ
ననువు నీక్షమబాట లందుఁ గలవు
లక్షలకొలఁదిగా లక్షింప వచ్చె నా
భోజనపాత్రముల్ భూతలమున
తే. జలము ప్రోక్షించి వేఁగురు చనిన వెనుక
నాజ్య మభిఘార మొనరించి రంత వడ్డ
నముఁ బొనర్పఁగ నగు నని సముచితముగ
ఘంట మ్రోఁగించి రంతట ఖంగురు మన. 78

వ. అలో వాసుదేవుండు ద్రౌపదీదేవికడకుం జని తల్లీ! నీ విపుడు మహాశక్తివి నాకుం జెల్లెలవు నీకు సూర్యదేవుం డనుగ్రహించి నాఁ డరణ్యావాసకాలంబున నిచ్చినతామ్రపాత్రము నే నిదె సంగ్రహించి యుంచితిని. దీని నీవు స్వీకరింపుము. నీకు వాయుదేవుండును సూర్యుండును నాంజనేయుండును సాహాయ్యంబు చేయుచుందురు. తొంటివలె నీ వీపాత్రిం బూని పంచపంచక్రోశంబులన్ భోజనపాత్రంబులు వేయఁబడియున్నయవి వడ్డనంబు గావింపు మేనును భీమసేనుండు నర్జునుండును బాసటగా నంచునందుఁ గాచుకొని యుందు మనిన నమ్మహాశక్తి మనుష్యస్వభావంబు విడిచి దేవరూపంబుఁ గొన్నచందంబున నై కృష్ణభగవానున కభివందనం బాచరించి పాత్రహస్తంబున సప్తాశ్వనకు మ్రొక్కు చెల్లించి కచ్ఛంబు బిగించి యోక్త్రంబుతోడం గలియఁ గటి పర్యంత వక్షం బంట నడుమునకుం జుట్టఁ బెట్టి

నెట్టన గట్టిగా నొక్క మా యోంకారంబు గావించి వడ్డింప
నారంభించె నప్పుడు. 79

సీ. ఇట్టటు మొగము మే నెన్నడుఁ ద్రిప్పుచు
వంగిన దేహము వంగినట్లె
కానంగ వచ్చెడుకరణి నల్తట్టుల
వడ్డింపఁ జొచ్చె నావరుసలందు
సన్నంబు నూప మాజ్యము కూర లావడల్
పిండివంటలు పచ్చిపండిమిరెము
పచ్చళ్ళు క్షీరాన్న మచ్చులు గారెలు
బూరెలు దోసెలు చారు మఘువు
తే. అని వచించుచు నిరత మా సుమ్మ ద్రవప
దార్థము లనఁ బాత్రము నట్టె నంచు
ఘనపదార్థము లనఁ బాత్రమునను జేయి
పెట్టి తీసి వడ్డించు నప్పట్టె యట్టె. 80

ఉ. నోటఁ బదార్థనామము కనుంగొని పల్కినఁ బుట్టి పెట్టగా
వాటము గల్గియుండు మనుపాత్రమునం దెది యుండెఁ బోవ దా
పాటలగంధి వస్తువులఁ బల్కుచు నెల్లకడం గలపంక్తు లన్నియున్
మాటికి గాలియో యనఁ గ్రమంబును మీఱక సంచరించెడున్.

శా. ఆకాశంబున శబ్ద మేకరణి నంతంతం బ్రచారంబుగాఁ
బ్రాకం జాలి ప్రవర్ధమాన మగుచున్ వర్ణింపగాఁ దోఁచునో
లోకం బచ్చెరుపాటు నొంద నపు డాలోలాక్షి సంచార మ
స్తోకప్రక్రియ హోరు మన్ రవ మిలన్ దోపంగ వర్తించెడున్.

సీ. ఆపంక్తిలో నుండు నంతటిలోన నే
పంక్తిలో నుండును బట్టి చూడ

సంతటఁ బాండునందనా క్రోసు లామెసు
సంగలలోన్నైన సంగతిఁ గను
దూరమందుండిన ద్రోవది పెట్టఁగా
నందలే పేవస్తు వనెడిమాట
పృష్టలే జెంటను భుజియించువారలు
తమచెంతనే యున్నదానిఁ గాఁగఁ

తే. నలఁచి రది చూచి దేవళ్లు ధాత్రిజనులు
పడుచు నచ్చెరు విది యేటి చాటి యనుచు
నిట్టు లేలోకమున నెవ్వఁ డెవరుఁ గాని
చేయ లే రని మెచ్చి రాచిగురుఁబోఁడి. 83

ఉ. వేల్పులపంక్తిలోపలికి వెళ్లినయప్పుడు ద్రౌపదీసతిన్
వేల్పులలోన వేలుపయి వేడుకఁ జూచుచునున్నవాఁడ నై
పాల్పడఁగన్ భుజించు రవిపుత్త్రుఁడు కర్ణుఁడు చూచి ద్రౌపదిన్
స్వల్పము గానిసంతస మెసంగఁగఁ గ్రక్కున మ్రొక్కె నామెకున్. 84

మ. ధృతరాష్ట్రాత్మజు లాసమక్షమునఁ బంక్తిన్ భుక్తి సాఁగించుచున్
సతిఁ బాంచాలినిఁ జూచి మాకులము ధన్యం బయ్యె మే మెల్ల నీ
సతిహస్తామృత మారగించుటను విశ్వప్రస్తుతోన్నత్యసం
గతి నైకె ఘాతుల మైతి మంచుఁ బలుకంగాఁ జొచ్చిరన్యోన్యముగ్.

వ. ఇట్లు మహాఖ్యాతికిం బాత్రీభూతురాలై దేవతలకును దేవతా
యోనివిశేషులకును భూదేవర్యులకును రాజచంద్రులకును బంధు
సముదాయంబునకును సర్వలోకంబులవారికిని సన్నిపదార్థంబు
లును గొఱవడకుండ వడ్డించుచున్న పాంచాలరాజతనయం జూచి
గోకులానందకందుండు గోవిందుండు లీలామానుషవిగ్రహుండు
గావున గాలిపట్టి నట్లెం గాంచి యి ట్లనియె. 86

శా. బావా! కంటివె ద్రౌపదీసతిని దేవవ్రాత మర్గింపఁగా
నేవంరీతిని వడ్డనంబు సలుపున్ హేరాళ మాహాప్రభుల్
చేవల్ మీఱుచునుండె నిట్టితటి నీ శ్రీదేవతామూర్తితో
నేవారైనను బోల్పవత్తురఁట వే యీమూఁడులోకంబులన్. 87

క. ఈ రేడుజగంబులలో
నీరీతిని సలుపఁ గలుగునేరిని నే నే
వారైనను గని విని యు
యున్నారేనియుఁ జెప్పఁ గలవె నా కొక్కనినిన్. 88

ఉ. భీమపరాక్రమంబు గలభీముఁడ నీ వొకలి ప్రమాత్రమే
నీమొఱ వడ్డనల్ సలుప నేర్పడియుండుసె చెప్పు మన్న నా
భీముఁడు రక్తనేత్రుఁడయి పిన్నమాట నొందుచు నేను జాలనే
కోమలిఁ జెద్దఁ జేయుదువు కొంతవిచారము సేయవెప్పుడున్. 89

క. న న్నెఱిఁగి నాదుశక్తిన్
గన్నులలోఁ జూచి యెఱిఁగి కనలించుటకో
మిన్నక పలుకుచు నుం డిటు
ని న్నేమన వచ్చుఁ దెలియ నేరను బావా. 90

వ. అనినఁ గృష్ణుం డప్పుఁ గాత మని కృష్ణాహ స్తంబునం గలపాత్రంబు గొని భీముని కిచ్చి వడ్డింపు మనిన నతండు దానిం బుచ్చుకొని సరుదుకొనుచున్నంత నన్నము కూర నేయి పాలు పెఱుగు పచ్చడి లోనగువాక్యంబు లెల్లచోటులఁ బెచ్చుపెఱిఁగి పెద్ద కోలాహలం బయ్యె నంత నుం గని వృకోదరుండు సిగ్గువడి వడ్డించుట కొక్కపదార్థంబును బాత్రంబునం గాన కట్టిట్టుపడుచుం డుద కేపాత్రంబునందు నింతపెట్ట లేనివాఁడై గర్వంబు సర్వంబును దిగఁద్రావి దేవ్వరించుచున్నం గని వాసుదేవుండు వానిచే నున్నపాత్రంబుఁ గొని పాంచాలి చేతి కిచ్చిన నామె యొప్పటియ

యెల్లవారికి భక్ష్యభోజ్యచోష్యలేహ్యాదుల సంతృప్తిం గావించి
నిట్లుదయంబు మొదలు రాత్రి జా మగువఱకును సమారాధనంబు
సాగించి ద్రుపదరాజపుత్త్రి హవిర్ధానంబునకుం జని పయోవ్ర
తంబు గావించు నిట్లొక్కమండలంబు సవనం బైనంత ఋత్విజు
లవభృథంబు గావించి రట్లు సప్తతంతు తంత్రసమాప్తిం గావించి
ధర్మనందనుం డెల్లవారికిని సంపూర్ణదక్షిణ లొసంగి శూన్య
కోశుం డై సవనాగతుల నెల్లవారి సాగనంపె నంతఁ బాండవు
లును, గృష్ణసాత్యకులును ద్రౌపదీరుక్మిణ్యాదులును ధౌమ్యాదు
లును గొంతకాలం బా కపిరగిరిక్షేత్రంబునం దుండి రక్కాలంబున
ధర్మరాజు ధౌమ్యాదులయుఁ గృష్ణాదులయు దిక్కు మొగం బై
యి ట్లనియె. 91

చ. మన మిట వచ్చి వాయుసుతుమాత్రము చూచితి మిష్టలంబునం
దనరు మహాత్త్వముం గనెడుదానికిఁగా మిట యజ్ఞదీక్షకై
దినములు పుచ్చినారము గదే యిఁక నిం దగుదివ్యబోధముల్
గన విన నేడఁపో తెలియఁగా మది చేసితి శాంతి చేకుఱన్. 92

తే. అనినఁ గృష్ణుఁడు ధౌమ్యాదిఘనులతోడ
ధర్మరాజాదులున్ వెంటఁ దవిలి రాఁగఁ
జెప్పి భీమునితోఁ దాను జెంత నున్న
కపిరగిరిసన్నికృష్టము నపుడు చేరి. 93

చ. కపిలము లైనజూలు గలగ్రావము దానినిఁ జూపి వాయుజుం
డిపు డిటువంటిరూపమున నిచ్చట నుండి తపించుచుండుఁ దా
నెపుడొ విరించి యై ప్రజల సృష్టియొనర్చుపదంబు నొందన
క్కపివరులోనియంగములఁ గ్రాలుచునుండును రామనామముల్.

తే. దానఁ జేసి యిపుడు దీనిజూ లన్నియు
రామనామములను గ్రాలుచుండు

జూడఁ డనుచుఁ జూపె సురుచిరం బగునొక్క-
జాతిఫలకయందు రామలిపులు. 95

క. ఈకొండజాలలోనన్
నాకోఁ దగుపచ్చ లనెడువరమణు లెన్నో
లోకాతీతము లగుచున్
శ్రీకరముల వై కరంబు చెన్నలరారున్. 96

వ. అని యభివర్ణించుటయును. 97

క. అచ్చెరుపడి ధౌమ్యాదులు
ముచ్చటపడి కొన్నిశిలలపోఁగులలోనన్
గ్రుచ్చుకొని చూడ నన్నిట
నచ్చెఱువుగ రామనామ మగి కన వచ్చెన్. 98

క. ఈజాలు పూజలోనం
జేరిచి సేవించువారిచెంతకు గ్రహముల్
క్రూరపిశాచము లెవ్వియుఁ
జేరవు రోగములు రావు చెప్పితి వినుఁడీ. 99

క. పసివచ్చజాతిగంధము
విసువక మొగమందుఁ దాల్చి వెడలినవానిన్
బసివట్టి చేరు సూపద
లసమగతిన్ వానివృత్తి యతిశయ మొందున్. 100

వ. అనిన నందఱు నన్నిజాలు సంపాదించి యుంచుకొని రప్పు
డప్పుండరీకాక్షునకు వెండియు. 101

ఆ. దీనిక్రింద నేఱు దీపించు నేటిపై
నాంజనేయుఁ డిట్టు లదిరి యగుచు
నిలిచె దీనిక్రింద నీటి నించుక త్రవ్వి
నంతఁ గనుఁగొనంగ ననువుపడును. 102

క. ఈకొండక్రిందినీరము
 లాకాశీగంగకన్న నత్యధికఫల
 శ్రీకము లయ్యెడు మానన
 లోకమునకు నమృత మిదియ లోఁ దలపోయన్. 105

వ. అని యొక్కింతదూరంబు నడచి యంగుళినిర్దేశంబు చేయుచు.

మ. అదిగో లోయ కనంగ వచ్చెడిని లోయన్ నీరు పైఁ బాఱుచు
 న్నది యెల్ల ప్పుడ తెంపు లేక కపిలానామంబునన్ వాకయై
 పదముం బట్టి యితస్తతఃకుటిల మా వ్యాపార మేపాఱఁ దూ
 ర్పుదరిన్ గల్గిన సంద్రమందుఁ గలియుం పుణ్యాంబుసంపూర్ణమై.

సీ. పాతాళముననుండి పయి వచ్చుజలము లీ
 లోయదారిం బట్టి పాయ నెపుడు
 హనుమంతుఁ డుత్తమ దినముల నీదారి
 నుండి భోగవతీపుర మొయ్యఁ జేరి
 పాటకేశ్వరునకు నర్చన గావించి
 వచ్చునంచున్ మునివరులు నాకుఁ
 దెలిపిరి లోయలో నలిపినస్నానాదు
 లక్షయఫలదము లగుచునుండు

తే. ఇందుఁ గలశిలాఫలకములందుఁ గలుగు
 సార్ద్రమృత్తిక పరమోత్తమౌషధ మయి
 యెంత లెంతలు రోగము లైన మాయ
 మయి తెగిపోవునట్లు చేయు సత్యంబ వినుఁడి. 106

మ. అదిగో యింతటిలోన బోనుకుధరం బౌ దానియం దొక్కచోఁ
 బొదలున్ బెన్గుహ దానినుండి కపు లెప్డున్ గాలిపట్టిం గనన్
 సదయాత్ముం డగుసూర్యసూతి పనుపన్ బ్రత్యహ్నము న్వచ్చి స
 త్యదివృత్తిన్ భజియించి పోవుదురు నిత్యశ్రీశుభప్రాప్తిగన్. 107

ఆ. అనిన భీమసేనుఁ డను నదె కుండము
నొఁడు పురుషమృగముజాడ తెలియ
వచ్చినపుడు హనుమ నెచ్చటఁ గనలేక
పిలిచి నాఁడ మేటియులివు పుట్ట. 108

మ. పిలువం బిల్వ మహాత్ముఁ డాతఁ డదె యీపెన్ గుండమం దుండి వే
రలి వొప్పన్ వెలివచ్చి నన్నుఁ గని యెంతో గారవం బేర్పడన్
బలుకుల్ సేయుచుఁబూరుషుంగొనుచుఁబోవంజాలుమార్గంబునుం
దెలియం జేసి యనుగ్రహించి చన నీదివ్యాస్త్రలాధ్యంబునన్. 109

ఆ. తాను బోవునపుడు తమ్ముఁడా! నీ వింక
జలము లాడి పొమ్ము శత్రుభయము
నీకుఁ గలుగఁ బోదు నీరువట్టాఁకలి
తోఁపఁ బోదు బలము తోఁప వచ్చు. 110

వ. అని చెప్పిన నే నిందు స్నానపానంబులు గావించి పురుషమృ
గంబు బాఱికిం బడక మార్గమధ్యంబున నాఁకలికిం దప్పికిం గాక
వాయువేగంబున నింద్రప్రస్థంబువఱకు రాఁ గలిగితి ననినఁ
గృష్ణుండు ధర్మరాజుదిక్కు మొగంబై తూర్పుదిక్కుం జూపుచు
నీప్రాంతంబున మనము చూచిపో నగువిశేషంబులు కొన్ని గలవు
గాని వైశ్వదేవంబునకు వేళ యగుచున్నది పర్ణశాలకుం బోయి
భోజనానంతరంబున విమానం బెక్కి పోయి వీక్షించి వత్తమనివ
నెల్లరు నౌ నౌ నని గృహంబులకుం జని దేవతార్చనంబు గావించి
యించుక విశ్రమించి స్త్రీజనంబుతోడం గూడ విమానం బెక్కి
యొక్కింతలోనం గలసంజీవిపర్వతంబునకుం జని యట విమా
నావరోహణంబు చేసి యున్నప్పు డప్పుండరీకాక్షుండు. 111

మ. ఇది సంజీవిసమాఖ్యచే నలరుగోత్రేంద్రంబు మున్ లక్ష్మణుం
బ్రదికింపంగ సుషేణుపంపున హనూమంతుండు ద్రోణాద్రి నా

త్రిదశేంద్రావిత మైనదానిఁ గొనిపో రేఁజీఁకటిన్ మాల్యవ
త్త్రిదశేంద్రాద్రి యెదిర్చి వాయుసుతు నబ్ధిం దాఁటిపోనున్న చోన్.

ఆ. అపుడు వానితోడ నాహవ మొనరించు
పవన శిరమునందు నలరుకొండ
చెఱియ మాల్యవంతు శస్త్రిహతింజేసి
పగిలి కొంతచెక్క పడియె నిచట. 113

క. అదియ యిది దీని విరాఁదన్
పోదలెడునోషధులు చచ్చిపోయినవారిన్
బ్రదికించునట్టి వగుచున్
త్రిదశమునుల్ వానిజాడ తెలియుదు రిప్డున్. 114

చ. నఱికిన వెండి యంటుకొని నల్గాగుచెట్లును స్థావరత్వముం
దొలఁగి మాఱొందుచోటులకు దోరుచు నేగెడుచెట్లు మర్త్యున
ట్లఱిమిఱి నాడుచెట్లు చదు వల్లెడుచెట్లును గాలి సోఁకినన్
మఱి బ్రదికించుచెట్లును గనంబడు నీనగమందు నిప్పుడున్. 115

చ. మడవల లోయలన్ మిగుల మాఁగి తమంతన వీఁగి నేలఁపై
బడి వడి విచ్చి పెంబనసపండ్లు స్రవించెడుపేన మొండొకం
డడగొని జాఱుకప్రపుటనంటులగుంజును రాల్మరండమున్
జడిబఱుజుంటితేనియలు జాల్కొని డిగ్గియ లొనటన్ సదా. 116

ద్విపద. ము న్నొకనాఁ డొక్కబోయ యాకొండ
నెన్నడుమున కెక్కి నిత్య మజముల
మేపుచో నొకనాఁడు మేటిపాటునను
రూపుమోఁ దల వ్రీలి రుధిరంబు గాఱె
వాఁ డేమి యెఱుఁగని వాఁ డయ్యె నందు
గూడినయాఁకులం గొని నల్పిరాసె
దాన వానిశిరంబు దగనొప్పెనప్పు
డీనగ మిప్పేర నింపొందె వినుఁడు 117

వ. అని యభివర్ణించుచుఁ దాని కింతదూరంబున నున్న కైలాసపత్తనం
బునకుం బోయి యట నున్న శ్రీ మహావిష్ణువిగ్రహంబు దర్శించి
శ్రీకృష్ణుండు ధర్మరాజాదులకుం జెప్పి దర్శనంబు చేయించి
తాను దేవునెదుట నిలిచి చేతులు జోడించుకొని. 118

మ. భవ! సింధుప్లవ! పార్వతీధవ! కవిప్రస్తూయమానోత్సవా!
భవ! గోసైంధవ! దేవబాంధవ! నమద్భక్తౌఘపాపాటవీ
దవ! సత్రప్రభవ! స్నిగ్ధమాధవ! సుధాంధశ్శత్రుసంఘాతభై
రవ! లోకప్రభవా! జితాత్మభవ! సంరక్షించు న న్నోశివా.

శా. జ్ఞానధ్వస్తకుటుంబశాఖలు తపోంచత్సిద్ధయోగీంద్రు లే
ప్రాగ్జ్యోతిః బరాత్పరుం నిలిపి తా రధ్యాత్మలం జూతు రా
నానాజంతుకదంబగర్భితలయుం త్రైలోక్యసంతాను నీ
శానుం గొల్చెద నిష్టసిద్ధికి సజ్జ్రిం బంతరంగంబునన్. 120

వ. అప్పుడు ధర్మరాజు తదేకధ్యానతత్పరుండై మోడ్పుఁగేలు ఫాల
తలంబునఁ గీలించి నిమీలిత లోచనయుగళుండై స్వామి దిక్కు
మొగం బై. 121

మ. భవదీయంబు కుటుంబనావ నడపింపం జాల నీ కెంగేలుల్
దవులం బెట్టఁగ నోప నీపడఁతివా ర్తల్ మోయఁగా లేను నీ
దవుకీర్తిం గొనియాడ నోడుదు నటే నర్థింతు నీబిడ్డనై
భవబంధంబులు వాయఁ జేయఁగదె దేవా! సత్యనారాయణా.

మ. శ్రుతులం గాచితి కొండ మోచితి ధరన్ శోభిల్లఁ గాఁ జేసి తు
ద్ధతునిం గోసితి బిచ్చమెత్తి తరిప్రోల్ దగ్ధంబు గావించి తా
క్షితిపవ్రాతము నొంచి తేరు గరిమం జేఁబూని తుద్గ్రీవసం
గతి వంచించి తనార్యులం బొడుతు వింకన్ వాసుదేవప్రభూ.

వ. ఇట్లు ప్రార్థించుచు ధర్మరాజట్టె కనులు విచ్చి శివప్రార్థనంబు
చేయు పుండరీకాక్షు నీక్షించి బావా! యిది యేమి విష్ణ్వాల

యంబున విష్ణుదేవునిం గాక శివదేవుం బ్రార్థించుచుంటి వేమి
చెప్పు మనిన నతం డతని కిట్లనియె. 124

తరువో. కైలాస మనియెడు గ్రామ మా నద్రి
కైలాసపతి శూలి గాఁడె తలంప
శూలికిఁ జౌరికిఁ జూడ భేదంబు
చూపట్టునే సత్యశోధనమునఁ
బోలింపఁగా నిది పూర్వకాలమునఁ
బురహరక్షేత్రమై పొలుపొందుచుండి
కాలాంతరమున నీకరణి మార్పందెఁ
గారణం బెఱిఁగింపఁగా రాదు నేఁడు. 125

వ. అని యటనుండి సముద్రంబుకడకుఁ జని యటనుండు కొండలుం గొండలం గలయ శేషవిశేషంబు లరసి సాయంసమయంబునకుఁ గపిరగిరికిం జనుదెంచి యా కారణంబున నట నుండునుప్పలా ముప్ప్లవం బనియుఁ బాండవుల మెట్టయు భీమునిగట్టు యనియు నిప్పటికిని వ్యవహారంబు గలిగె నని మఱియు. 126

ఉ. అవ్వలఁ గొన్నినా ళ్లచట నాయదువల్లభుతోడఁ బాండవుల్
నివ్వటిలంగ సౌఖ్యమున నిల్చి హనూమదనుజ్ఞ నెల్లరున్
దివ్యవైభవం బెసఁగ దేవవిమానము నెక్కి వీటికిన్
రివ్వునఁ బోయి రంచు వివరించెను సూతుఁడు ధీసమేతుఁడై. 127

వ. అట్లు వివరించి చెప్పిన నైమిశారణ్యనివాసులు కపిరగిరిక్షేత్రప్రభావంబును బ్రసన్నాంజనేయప్రభావంబును విని సంతసించి రోమహర్షణిం గౌరవించుచు నోయీ సూతా! నీవు మా కపూర్వచరిత్రంబు చెప్పి యానందం బాపాదించితివి కాని తత్క్షేత్రంబు నేభక్తుం డెట్లు సేవించి యెట్టియెట్టిఫలంబు లందెనో చెప్పి మాకానందంబు గూర్పు మనిసూతు నడుగుటయును. 128

ఇది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# కపిరగిరిచరిత్రము

## ప్రసన్నాంజనేయ ప్రభావము

### చ తు ర్థా శ్వా స ము

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు లోకో
త్తరమహోత్తరంబై కపిరగిరిక్షేత్రంబు లోకవిఖ్యాతిం గాంచి
యున్నకాలంబున. 1

గ్రహపీడితుని కథ

మ. వరగోదావరితీరమందుఁ ద్రిజగద్వర్ణ్యప్రభావాఢ్యమై
పరికింపం దగువీరభద్రపురమన్ భవ్యాగ్రహారంబు భూ
సురవంశాగ్రణు లెందఱో గల రటన్ శుద్ధస్వభావోత్తరో
త్తరసత్త్వాన్వితసత్ప్రచారు లయి సత్యశ్రీసమాచారులై. 2

ఉ. అందఱు వేదశాస్త్రములయందుఁ బ్రవీణతఁ గాంచినట్టివా
రందఱు సర్వతోముఖముఖాధ్వరముల్ పొనరించినట్టివా
రందఱు బ్రహ్మవేత్తృపద మంది వరంబును గొన్నయట్టివా
రందఱు సత్యమూర్తులు మహాత్ములు సత్యవచస్కు లారయన్.

సీ. ఏవాఁడు నేనాఁడు నేదానమున కేని
చే చాపి యెఱుఁగఁడు సిరి గలాఁడు
పంచభక్ష్యాదులఁ బరమాన్నమేఁ బొరు
గింటిలోఁ దినుటకు నేవగించు
పత్రితు లగ్నిహోత్రమున్ సతతము మెపగట్టు
కొని సంచరించెడుఁ గొండికయును

జపతపస్స్వాధ్యాయ సత్ప్రవచనములే
స్వాధనంబు లంచును సాఁక నెంచు.
తే. రసనచివరకుఁ గాదు మానసప్రదేశ
మునకు నే నె ప్రసత్యమున్ మొనయ నీఁడు
కని యెఱుంగఁడు పరనారిఁ గలను నైన
వీరభద్రపురంబున వెలయుద్విజుఁడు. 4
చ. అలవిబుధాగ్రహారమునయం దగుచాఁ డొకనాఁటి కాటపా
టల నెఱుఁగండు కోపపరుషోక్తుల్ పరుషంబులు వానినోటికిన్
గలిగినజాడ లెవ్వరును గాని యెఱుంగరు వాగ్వివాదముల్
తొలఁచి చనున్ నిరంతరము దూరము దూరముగాఁగ నచ్చటన్.
సీ. విధవలై వెలఁదుకల్ వెదకినం గనరారు
పుత్రుఁ డీల్గఁగ దండ్రి పుడమి లేఁడు
వ్యాఘ్రు లాధులు లేవు వసుమతిపై నెప్డు
నెల మూఁడువానలు నిలిచి కురియుఁ
బాడిపంటలు హెచ్చు ఫలపుష్పభరితముల్
తరుగుల్మలత లెల్ల ధరణి నెందు
జారచోరభయంబు జాడ చూపట్టదు
ధర్మము నాల్గుపాదముల నడచుఁ
తే. దలఁప వర్ణాశ్రమాచారములకు నెపుడు
లోటు పా టింతయే లేక పాటి గలిగి
యుండె వేదవేదాంగము లొప్పమిగిలెఁ
బ్రాహ్మసురేంద్రులు వఱలునాకాలమందు 6
వ. ఇట్లు కృతయుగ ధర్మప్రచారంబునఁ బ్రపంచకాతీతప్రకారంబై
ప్రస్తుతింపం బడునయ్యగ్రహారంబున. 7
తే. కలఁడు మధుసూదనుం డనులలితమూర్తి
పౌండరీకాధ్వరి సుతుండు పండితుండు

వేదశాస్త్రము లాతనివి త్త మగుచు
నతని నలరింపఁగాఁ జేయు నన్నిగతుల. 8

చ. ఇరువదియైదు వర్షములయీడు గలాఁగు పదాఱువన్నె బం
గరువున కెత్తువచ్చుమెయికాంతి జయంత వసంత కంతులన్
సరిపడఁ జేచ్చియుండు నని సన్నుతిహించినవాఁడు వానికిం
దరుణి మనోహరాంగి యగుతన్వి కులాంగన యయ్యె నయ్యెడన్.

సుముఖి. కులాచారధర్మంబు గొప్పదై యెప్డున్
వెలుంగొంద నాతండు విశ్వ విఖ్యాతిం
గలండై పౌనర్చేన్ మఖంబు ల్కత్రాజ్ఞన్
బలారే యటం చెల్లవారుమెచ్చంగన్. 10

ఉ. స్నానము సంధ్యయున్ జపము సజ్జనసేవయు నగ్నిహోత్రమున్
గాని మఱొక్కకార్య మొకకాలము నాఁటికిలేని వాఁడ యై
కానఁగ రానివస్తువును గాంచెడుచిత్తము గల్గి పెద్దలన్
మానక కొల్చుచున్ దనరె మంచితనంబున సంచరించుచున్. 11

మహాస్ర. వనదుర్గన్ భక్తితోడన్ వదలక సతముఁ బట్టిపారాయణంబున్
బొనరించున్గొంచుబాలన్మనుకొనినియతిన్మూడుప్రొద్దుల్ జపించుఁ
* గినుపేదన్ రాజమాతంగినిఁగొనిమదిలోఁగీర్తనంబేర్పడంగా
మనువున్ ధ్యానించుఁగాళిన్మతిమఱిదలచున్మంత్రతంత్రప్రసక్తిన్.

తే. అరుణుఁ డుదయించినప్డ గాయత్రి శ్రోత్రియుగం విశ్వవిఖ్యాతియు
మాఱులు జపించి యజ్ఞకర్మంబునంద గ్రంథాలయము
చిత్త మొనరించి శూలినిం జేరఁ బోయి
సూర్యునిం గొల్చు నామధుసూదనుండు. 13



* కినుపు=కోపము; కాల్గడి=మూత్రోత్సర్జనము; గోల్మసఁగు=అతిశయించు.

వ. ఇట్లు ప్రత్యహంబును నిష్ఠాగరిష్ఠుండై నియమవ్రతంబునఁ బ్రవర్తి ల్లుచు సత్కాలక్షేపంబు సేయుచున్నంత నొక్కనాఁడు. 14

ఉ. కాల్మడి చేసి యాచమనకార్యముఁ దీర్పక యుండునంతలో
జాల్మ్రుఁడు బ్రహ్మరాక్షసుఁడు సత్వరగామి నభంబునుండి ని
ష్కల్మషమూర్తి వానిఁ గని గాలితెఱంగున వచ్చి పైఁబడెఁ
గోల్మసఁగం బ్రకోప మది కొంచెము గానిభయంబు గొల్పుచున్.

వ. ఆహవనీయంబున నగ్నిం బ్రణయించి హోమంబు చేయుచున్న దీక్షితుం డగుమధుసూదనునిపై నట్లు బ్రహ్మరాక్షసుండు వడివడిం బడి నంత నతండును. 16

ఉ. హార్మని యొక్కకేక నిడి యంతరవేదిపయి రయంబునన్
హోర్మనుశబ్ద ముప్పతిల నొయ్యనఁ గూలియు నుచ్చిళుల్ గడున్
నోర్మడలంగ గ్రక్కుచుఁ గనుంగొనువారికి సాధ్వసంబు రా
దుర్ముఖుఁడై కనంబడియె దొడ్డతనం బఱి గొడ్డువోలె నై. 17

ఆ. మేను గాజు వాఱె మేదినిపైఁ బడి
వడకి కొనుచు నోటివలన నీళ్లు
లూరి కాల్వఁ గట్టె నుర్విపై నుచ్చిళ్లు
నుఱుగు దెట్టె లట్లు పఱవఁ జొచ్చె. 18

ఆ. అపుడు లోనినుండి యమ్మయు నబ్బయు
నాలు వడిగ వడిగ నటకు వచ్చి
చచ్చిపోవువానిమచ్చున నుండిన
బాలయాజిఁ జూచి గోలు మనుచు. 19

వ. నలువురు నలుమూలలం గట్టుకొని బిట్టేడ్వఁజొచ్చి రప్పట్టున నిరుగుపొరుగువా రది యేమియుపద్రవమోయనిపఱుగుపఱుగునం బఱచి వచ్చి చచ్చినట్లు పుడమింబడియున్న మధుసూదనుం జూచి యేమియుం జేయఁజాలక వారు నింతకాలము దుఃఖించుచుండి

రంతఁ గొంతలో నతని నగ్నిహోత్రగృహంబునుండి యవ్వాలకుఁ
దెచ్చి యొక్కకృష్ణాజినంబునం బండుకొనం బెట్టి బిట్టుగిరిపడు
నట్టి యెడం బట్టుకొని తత్కాలోపచారంబులు గావించుచుండి
రంతలోన. 20

శా. ఆయుర్వేదవిశారదుండు ద్విజవంశాగ్రేసరుం డైనను
బ్రాయాఖ్యుం డను వైద్యశేఖరుఁడు తత్ప్రాంతంబున న్మెట్టుచున్
బాయన్ బోవనిరోదనంబు విని యాపత్కాల సద్బంధువై
వ్యాయామంబన కేఁగుదెంచె నటకున్ వారించుచున్ దుఃఖమున్.

ఆ. చేయి పట్టి చూచి చేతిలో నాడినిఁ
బట్టలేక మఱియుఁ బట్టి చూచి
భూతనాడి యనుచుఁ బోలించి వేయించెఁ
గొన్ని వేళ్ల పొగలు కొంతలోన. 22

తే. మూరుకొండాకుపస రది ముక్కులందుఁ
గన్నులందును బోయించి కల్కములను
వేసి దోసము వారెడు వేఁడిమందు
లరగఁ దీయించి పోసె నాస్యంబునందు 23

వ. అంతఁ గొంతలోన. 24

తే. ఏడుకొండలపొడువున వేఁడి గలిగి
వేఁకి మీఁది మీఁది కెసర వేసి కొనుచు
వచ్చె దాహము దాహా మన్ వాకు హెచ్చె
దద్దఱిల్లెను మే నెల్లఁ దండ్రి పొడమె. 25

ఉ. వేఁకి యడంగెఁ గాని కడువేదురుచేష్టలు వెట్టి కేకలున్
వాకులు ప్రేలడంబులును వారిని వీరినిఁ గొట్టఁబోవుటల్
కోకలు విప్పివేయుటలుఁ గొంపలు గూల్చుట నవ్వు లేడ్చుటల్
మాకొను టొండ్ల మొత్తుటయు మాటికి మాటికిఁ జేయుమోఱకై.

సీ. ఎదిరిఁదన్నెఱుంగఁడు బెదరించిన వినండు
కొట్టిన దిట్టినం గూడ దనఁడు
తినఁడు త్రావఁడు మాత్రమనియు మలంబని
యేవగించుట లేదు వావి విడుచు
నేడుచుం బాటలు పాడు నాతులలోన
నుఱుకుఁ జచ్చెద ననునెఱుక సున్న
యగ్న్యాగారమునందె యన్నిపనులుసేయు
విట్టు చేతం బట్టి వెట్టు నోటఁ
తే. దల్లిదండ్రులఁ దిట్టెడు నిల్ల నందు
వల్లకాటికిఁ బోయెడుఁ జెల్లె లయినఁ
బెండ్లమును బోలి మాటాడు వెంగలియయి
చెడ్డపనులను జేయు నేయడ్డు లేక. 27

క. ఎద్దువలె బలిసి కొన్నా
ళ్లద్దియు నిద్దియును బట్టి యటు నిటు సేయుం
మొద్దన నుండెడువాఁ డపు
డెద్దియు గారణములేక యే వఱు గవ్యోఁ. 28

క. నిద్రాహారము లెట్టివొ
తద్రాత్రిల నెఱుఁగ కతఁడు తబ్బిబ్బుపడుం
క్షుద్రములవంకఁ దిరుగుచు
భద్రములకుఁ బాసెఁ గర్మపరిపాకమునన్. 29

క. ఏకైకపుత్రుఁ డాతం
డీకరణిఁ వితగఁ బోవు టీక్షించి కడున్
శోకము పాకము నొందఁగఁ
బోకారిరి కన్నవారు ప్రొద్దుం బ్రొద్దున్. 30

ఉ. కొట్టినఁ దిట్టిన స్మృతియుఁ గోపము చూపినఁ బాపకర్మముం
బెటిన నేమిచేసినను వీడక యోడక కూడిమాడి తా

నెట్టియెడన్ బ్రవర్తిలుచు నేపనిఁ బూనను జేము రోయఁ బో
కట్టిదురంతకాలమున నాతనిపత్ని భరించుఁ దద్ర్కియల్. 31

శా. ఇందోర్విపేంద్రసదృశుఁ డైనదయితుం డీరీతిగాఁ బోవుటన్
సాంద్రంబై వ్యథ వేపుచుండినను గాసంతైనఁ జింతింప కా
చంద్రాస్యామణి భర్తృసేవ యెపుడున్ సాగించుచున్ నిత్యని
స్తంద్రప్రక్రియఁ గాలముం గడపెఁ బ్రాప్తంబున్ విచారించుచున్.

తే. మందులును మాకులును మహామంత్రయంత్ర
తంత్రములు రక్షరేఖలు తాయెతులును
తీర్థములును విభూతులు దిగదుడుపులు
వేనవేలుగ నయ్యె నావిషదినముల. 33

వ. ఇట్లొక్క యేఁడుసంవత్సరంబు లైనయప్పు డొక్కనాఁ డొక్కజోగి
భాగవతోత్తముం డావీరభద్రపురాగ్రహారంబునకు వచ్చి తద్వృ
త్తాంతం బంతయు విని యిది మహాగ్రహంబు మనమంత్రతంత్రం
బులు వీనికడ నేమియుం బని సేయవు మీరు నాచెప్పినచొప్పు
నం జేసితిర యేని మండలదినంబులలో మీానందనుండు మీాకు
నగు నని బాలయాజితల్లిదండ్రులం జేరి యి ట్లనియె. 34

సీ. ఆంధ్రదేశమునందు నల విశాఖపురాధి
మండలంబునయందు మండిత మయి
సంజీవిపర్వతాసన్నదేశమునందుఁ
గపిరాద్రి యనుపేరఁ గలదు కొండ
హనుమంతుఁ డారీతి నద్రిపై విలసిల్లు
నందలిజాతెల్ల నరయ నరయ
రామతారకనామరమ్యాక్షరంబులఁ
బొలుపుమీరుచునుండుఁ బూజ్యులార.

తే. కొండపేరు చెప్పినమాత్రి దండిగ్రహము
లైన నశియించి పోయెడు వీని నటకుఁ
దీసికొనిపోయి కొండకు దినము దినము
ప్రిహరి దిరిగిన గ్రహమిది వదలి పోవు. 35

వ. మీరు నలువురు వీరాంజనేయమంత్రంబు జపించుచుం గపిరగిరికిఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించుచు నలువదిదినంబు లట నుండిన మీకుమారుండు రహూకుమారుండై రమణించు నని చెప్పి చనియె నంత నాదంపతులు కొడుకునుం గోడలినిం గొని పరివారపరివృతులై పయనంబై కతిపయప్రయాణంబులఁ బ్రసన్నాంజనేయక్షేత్రంబునకుం జని కపిలానదిం జలంబు లాడుచు దినంబు దినంబు నాకపిరగిరికిఁ బ్రదక్షిణంబులు గావించి నియమవ్రతంబున నర్ధమండలం బుండి హనుమంతు నారాధించుటం జేసి బ్రహ్మగ్రహం బంగారదర్శనంబున భల్లుకంబు పోలె బాలయు జ్వ[illegible]వాసి చనియె. నంతన శాంతింపక వారు నలుగురుం జక్కనినాళ్లు నం దుండి దీక్షం గొనసాగించి సఫలమనోరథులై నిజాగ్రహారంబునకు నిర్గమించి రని చెప్పిమఱియును. 36

కుష్ఠవ్యాధి పోయినకథ.

చ. కలఁ డొకరాజవంశమునఁ గ్రాలెడు దేశమునందు వైభవో
జ్జ్వలసకలక్షమాతలవిశాలవిభుత్వవిరాజితుండు శ్రీ
కలితుఁడు శౌర్యసారజితకష్టసపత్నుఁడు పూర్వరాజమా
ర్గలలితలక్షణుండు సురరాజసదృక్షయశుండు మున్నిలన్. 37

తే. తొంటికర్మమునం జేసి దొడ్డవ్యాధి
వానినొందెఁ బోడసూపె నేవైద్యులైన
వానివ్యాధి నివారింప లేనివార
లైరి ధన మెంతయేనియు నయ్యె వ్యయము. 38

సీ. రసి గారుపుండ్లును రక్తము గార్పుండ్లు
నెట్టఁ బాఱినపుండ్లు నెందుఁ గలుగఁ
బూయశోణితగాత్రుఁడై యీవ లావల
మిలమిలలాడుచు మొదలఁబుర్వు
లర్వ్వదిగడియలు నట్టెట్టు కొట్టుమి
టాడుచు గా లింటెనంతఁ గ్రిమ్మఁ
గాలుసేతులు వ్రేళ్లు గడికండలై పోవ
నడ శక్తి సర్వము నడఁగిపోవ
తే. అస్థిమాంసావశిష్టుఁడై యవనివిభుఁడు
వ్యాకులీభూతుఁడై సకలాప్తులును
జెడినవాఁ డయి మంత్రులఁ జేరఁబిలిచి
హృదయమును జాయిగాఁ జేసి యిట్టు లనియె. 39
ఆ. తగనివ్యాధి నాకుఁ దగిలె మాన్పఁగ నేరు
చాలకుండి రింకఁ జాలు భవము
నేను మిత్తివాతి కేగువాఁడన్ మీార
లేలుకొనుఁడు రాజ్య మిది యటంచు. 40
వ. అని పలికి యతండు కపిలానది పాతాళంబునందుండి భూతలంబు
నకు వచ్చినచోటిమాహాత్మ్యంబు విన్నవాఁడుగావునఁ గతిపయ
జనసహితుండై యచటికిం జని. 41
సీ. జల్లుమంచున్ వచ్చుజలధార వెల్లువ
యై పాఱఁ జొచ్చినయట్టిచోటఁ
గలమన్ను మేనెల్లఁ గలియంగ రుద్దుచు
నాళ్లలంబుల స్నాన మాచరించి
యాజలంబులు ద్రావి యాహారముగ నాజ
లంబులే యన్నినాళ్లను గయికొని

యాలోయయందే విహారము సేయుచు
నం దొకచో రాత్రులెందుఁ బండి.

తే. కపిలకాచపాత్రమున నక్కడిజలంబు
పోసి సూర్యతప్తము చేసి మూఁడు నాల్గు
వారములు మందుగాఁ దావి యాఱునెలలు
దీక్ష గావించె నారాజదివిజవిభుఁడు. 42

ఉ. దానఁ గ్రిమక్రిమంబుగను దద్దురోగము మళ్ళఁబాఱ మున్
మేన నెసంగుపుండ్లు మెలమెల్లగ మానుచు వచ్చె దొప్పలై
మానతి పోవునంగములు మస్సైములై వెలయంగఁ జొచ్చె మే
గాన గ నయ్యె బంగరునిగారములై జలవైద్యశక్తులన్. 43

కాష్ఠవిక్రేతకాంచినచిత్రము

సీ. దినము కట్టెలఁ గొట్టుకొని యమ్మి జీవించు
వాఁ డొక్కనాఁట నప్పర్వతమున
కరుదెంచి యొకవంచఁ బరశువునం జెట్లు
నఱుకుకొంచుం బోయి నలుగడలకు
కుఱలి వచ్చుచు వాని సరిచేసి మోపులు
కట్టుకొనం బోయి కాన కచట
నఱికినచెట్లెల్ల నలువుమీఱఁగఁ దొంటి
యట్టు లమకుకొన నచ్చెఱుపడి.

తే. యేమి విడ్డూర మిది యిట నెల్లచెట్లు
చేమలును శూన్యమై పోవఁ జెరివి యుంటి
నానడచుజాడ లన్నియుఁ గాన వచ్చుఁ
గాని నఱికినజాడలు గాన రావు. 44

తే. వేనికొమ్మలు వానికి వెండి యుంటె
కొనియె నిది కొండదేవర కనికరించి

చెట్లకుం జేసె నుపకార మిట్లు గాక
యున్న నీరీతి నెందునే నుండు నార. 45

ఆ. చలిది కూటివేళ నిలువాసి వచ్చితి
వాలిఁ బడియెఁ బొద్దు వచ్చి చేసి
నట్టికార్య మిట్లు వ్యర్థమై పోయె నే
నేమిసేయువాఁడ నీశ్వరేచ్ఛ. 46

వ. అని వట్టిచేతులతోడ గూడెంబునకుం జని కొండదేవరగొప్ప
తనం బంతయుం దనపెండ్లామునకునుం బోరుగువారికిం జెప్పె
నప్పుడు. 47

సీ. తెగఁ గొట్టినఁగా వెండి తగులుకొని తలిర్చు
వృక్షము లాకొండ వెలయు ననుచు
నెల్లదిక్కులయందు నెల్లడి యయ్యె నా
వింతఁ జూడగ నప్డు కొంతమంది
సంజపడెడువేళ సంజీవికొండకుఁ
బోయి యుండినయప్డు భూమిమీఁద
స్త్రీపుంసవృక్షముల్ చేరంగనై పండి
క్రీడసల్పుచు వారిజాడఁ దెలిసి.

తే. వడివడిగ లేచిపోయినకడిమి మఱియు
మాటలాడెడు తెఱగును మాటి కపుడు
వారి కంటికిం జెవులకు వచ్చెఁ దెలియ
వెఱచఱచి వారు పఱచిరి విడిదలకును. 48

వ. వా రావృత్తాంతం బంతయు నూరివారి కెఱింగింప నెల్లవారుం
దాని దెయ్యంపుఁగొండ యనియు నందుఁ బోయినఁ బ్రాణా
పాయంబురాక మానదనియు నిశ్చయించి యెప్పుడు నావంకకైనం
బోవకుండి రిటు కొంతకాలంబు గడచినంత. 49

సీ. వైశాఖపత్తనప్రాంతంబునం దొక్క
పుర మొప్పుఁ గాంచనవర మనంగ
నం దొక్కధనవంతుఁ డగువిప్రుఁడు వసించు
వీరశర్మ యనంగఁ బేరు వడసి
సంపత్సమృద్ధిమై చనువాని కొక కళ
త్రము పొల్పు మీఱు విద్యావతి యన
రతిమన్మథులు వోలె నతులితప్రీతిమై
సాఁగించుచుండ్రి సంసార మపుడు
తే. వారి కేకైకపుత్త్రుఁడు వాసుదేవ
నాముఁడు మనోజ్ఞరూపుఁ డందమున మఱియు
చందమున వానిఁ బోల రాచందమామ
కందుఁ డాదిగ నగువారు కొంద రైన. 50
చ. అవయవసౌష్ఠవంబు గలఁ డాతని మేను గడానిపైడికిన్
జివచెడ బొమ్మగట్టు నతసీకుసుమంబుల ధిక్కరించు సౌ
రవు తలవెండ్రుకల్, లపన మబ్జముతో సరితూఁగుఁ గన్నులున్
దొన లనవచ్చు నెన్నడుము తోఁపదు వాని కొకింత మాత్రమే.
క. సర్వాంగసౌష్ఠవంబున
నుర్విం గలవారిలోన నున్నతుఁ డగుచున్
పర్వేందుసుందరాస్యుం
డుర్వి న్నవమదనుఁ డనెడునుపమితి కర్హ్యేన్. 52
వ. ఇట్లు లోకైకసుందరుం డయ్యును వాసుదేవుండు మాటలురాని వాఁడై మూఁగయై యుండి తల్లిదండ్రుల కత్యంత విషాదంబు గలిగించువాఁ డయ్యె నయ్యెడ. 53
సీ. మూఁగయేకా నెడమూఁగ గాకుండుటఁ
జెప్పినమాటలు చెవులఁ బెట్టు

చెవిఁ బెట్టి యాపనిఁ జేయును జేసిన
యంతయుఁ దెలిసినయట్ల యుండు
మాటమంతియు లేనిమనుజుఁడై తా నుంట
కెంతేని సంతాప మెపుడుఁ దెలుపుఁ
జదువు సంధ్యలు లేనిజడుఁడ నైతి నటంచుఁ
దనతొంటిచేఁతకుఁ దాన వగచు.
తే. తాతతాతయుఁ దండ్రియు తాతతండ్రి
మొదలు గాఁగలతనకులమున జనించు
వారు చదివినవా రయి పేరు గాంచి
రేను జడుఁ డైతి నని చాల నేడ్చు లోన. 54

వ. అట్లుండినను దల్లిదండ్రులు వాని కక్షరాభ్యాసంబు చేయించి కాలక్రమంబునఁ జౌలోపనయనాదిసంస్కారంబులు గావించి రంత నబ్బాలుండు పరిజ్ఞానంబు గలవాఁడై తనజన్మంబు వ్యర్థం బనియుఁ దా నట్లు జీవించుట కన్నఁ జచ్చుటయ శ్రేయం బనియు నిశ్చయించుకొని కపిరగిరిప్రాంతంబునం బొలుపొంది యుండు సంజీవిపర్వతంబున ననేకవిషవృక్షంబు లుండు ననియు భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షసు లాపర్వతంబున నెవ్వేళ సంచరించుచుందు రనియుఁ దా నక్కడకుం బోయి యేబ్రహ్మరక్కసివాతం బడుటయో యేవిషవల్లియో తిని మృతిం బొందుటయో కావించెద నని యెవ్వరికిం దెలియకుండ నొక్కనాఁడు నడికి రే యైనయప్పుడు కటికిచీఁకటి సాయంబుగాఁ బయనంబై తెల్లవారునప్పటి కప్పర్వతంబునకుం జని దానియడియాలం బంతయు నెఱింగి యున్నవాఁడు కావున నొకరు చెప్పకుండ తా నప్పర్వతం బెక్కి యొక్కమూల నేరికిం గానరాకుండ నివసించి యుండె నప్పుడు. ౫౫

సీ. ఏశాయ పం క్తైన నేరి నోటం బెట్టి
కొని యూఁకలిం దీర్చుకొను దినంబు
నేయూఁకురస మైన నేనిఁక పైనను
సగఁ దీర్చుకొనఁ దెచ్చి త్రాగుచుండు
నేపుట్టలో పాము నేమి చేసినఁ జేయ
నీ యని దానిని బాయకుండు
నేమొల్లుగొ క్తైన నెమరయి తనుఁ బట్టి
చంపెడునో యని సతము చూచు

తే. భూతములు ప్రేతములు కొండఁ బాదలు చుండు
నని యెఱుంగుట నలుగడ నరయు చుండుఁ
జెట్టు పుట్టన కెల్లెడఁ జేరి మెలఁగు
బ్రదుకుపై రోసి యూవిప్రబాలకుండు. 56

చ. ఇటు లోకమూడునా శ్లచట నిట్టులు నట్టులు మెట్టికొంచు నాఁ
కటి కెదియేని తించు నలకారడవిం బడి సంచరించుచున్
దటుకునఁ జావనున్న ద్విజదంపతి పుత్రుఁ డతండొకానొకొం
డటఁ దనచేతికిం దగులునాకును గైకొని మెక్కె మెక్కెన్. 57

ఆ. నోటినుండి నుచ్చు లేటికాల్వం బోలి
పాఱఁ జొచ్చె నట్లు పాటి పాటి
నంత వానినాల్క కొంతలోఁ దేలిక
పడినయట్లు పలుచఁ బాడె నపుడు. 58

ఆ. అత్త తాత యంచు నానాఁడు చెప్పిన
నుడులు నోటినుండి వెడలఁ జొచ్చెఁ
గ్రిమము గాక వాక్యసముదాయ మంతయుఁ
బలుకఁ గలిగినటి ప్రజ యబ్బె. 59

వ. ఇట్లు ప్రజ్ఞావంతుండై బాలకుండు కపిరగిరిక్షేత్రంబునఁ బ్రసన్నాం
జనేయుండు జపించుచుండె నని వినియున్నవాఁడు కావున నటఁ
జని కొన్నినాళ్లకు నాతనిదర్శనంబు చేయం గలిగి వానివలన
శాస్త్రాధ్యయనంబు చేసి వాసిం గాంచె నని మఱియును. 60

## రాజకళింగగంగు రాజ్యప్రాప్తి

ఉ. రాజకళింగగం గనెడురాజమహేంద్రుఁడు తొల్లి మేటియై
రాజిలుచుం గళింగభువి రాజ్యము సేయుచు నుండె నయ్యెడన్
రాజు లకెప్పనమ్ముఁలు నిరంతరముం గొని చేయుచుండఁగాఁ
దేజము గాంచి యానృపతి దేవవిభుం డన నొప్పె నప్పుడున్.

చ. కవులును గాయకుల్ సతము గాన మొనర్పఁగ నైజతేజమున్
జెవులను వించు నాకు సరి చెప్పఁ గలాడు ధరాతలంబునం
దెవఁడును లేఁ డటంచు మది నేర్పడియెక్ గరువంబుదాన రాజ్యముం
దెవ రెటులుండిరో తెలియ కేదియుఁ జూడక యుండె నందునన్.

క. అరి గట్టురాజు లెవ్వరు
నరి గట్టక తన్నుఁ గొల్చునట్టిరుగా కా
ధరయందుఁ బ్రతిఘటించిరి
పరమిత్రుడు శత్రుఁ డయ్యె వానిబలంబున్. 63

తే. వాని ద్వేషించి దుర్గ మొడ్డి వడిగఁ బురము
వెడల నడచిరి గంగు నవ్వేళఁ దాను
చేయునది యింతయును లేక చెన్ను దఱిగి
సర్వమును బాసి యడవుల చక్కిఁ బట్టె. 64

వ. ఇట్లు నానారణ్యంబుల సంచరించుచుఁ బ్రసన్నాంజనేయుండు
ప్రజారంజకుం డనియు భక్తులపాలింటికిం గొంగుబంగార మని
యుం దెలిసి కపిరగిరిక్షేత్రంబునకుం జని యాంజనేయకుండంబున

జలంబాడి తత్పరిసరంబునఁ బర్ణశాల నిర్మించుకొని యందుండి జలపానంబు మాత్ర కావించుచుం దదేకదీక్షంజేసి కొన్నివారంబు లాంజనేయమంత్రజపంబు గావించుచు నాంజనేయకవచంబు పఠించుచు నిత్యనియమవ్రతంబున నుండె నప్పుడొక్క నాఁ డాంజనేయుండు సాక్షాత్కరించుటయు నతండు లేచి సాష్టాంగనమస్కారంబు గావించి నిలిచి చేతులు జోడించుకొని,

దండకము. శ్రీమన్మహాదేవ తేజస్సముద్భూత! వాతాత్మజా! వానర శ్రేష్ఠవంశాబ్ధిచంద్రోదయా! శాశ్వతానంతదయాసాంద్ర! సత్యోల్లసన్మూర్తి! సత్కీర్తి! దేవా! మహాభాగ! నీ వైభవం బెన్న బ్రహ్మాదులుం జాల రే నెన్నఁగా నెంత నీ వింతలోఁ బుట్టి కొండంతవై సూర్యునిం బట్టి పండంచు మ్రింగంగ నై తింద్రు వజ్రంబు నీ లోమముం బీక లేకుండె నీపైఁ బగంజేసియున్ బ్రహ్మ బ్రహ్మాస్త్ర మేయంగ నిన్నేమియుం జేయలేకుండె నయ్యస్త్ర మరుఁ గందు నీ కిచ్చె షట్శాస్త్రముల్ సర్వవిజ్ఞానముల్ సర్వశక్తుల్ సమస్తప్రపంచంబు దీబాహుపీఠిన్ భరింపంగ నేర్తంజనానందనా! సుందరాంగా! నినుం జెప్పఁ జెప్పంగ నా నొడ్ల నీ వారసముద్రంబు లంఘించి సీతామహాదేవినిం జూచి శ్రీరామచంద్రాత్మకున్ సంతసం బేర్పడన్ దేవివార్తం దగం దెల్పి ఫాల్పొంది తో మారుతీ! చూచి రమ్మన్నచోఁ గాల్చి విచ్చేసి తా లంకిణిం లంకలో నింద్రజిన్ముఖ్యులన్ బెక్కురం జెక్కిపింపెక్కేతి వఫ్లు సంజీవనిం దెచ్చి సౌమిత్రిప్రాణంబులం గాచి రక్షించి తామాల్యవంతుండు సంద్రంబుపై నిన్ను మారోకఁగఁ గారోకన్నవారికిన్ నిమేషాంతరంబందు నీల్గించి తీసుండు నీ నాఁడు నీ వారమాదేవికిన్ భక్తుఁడై సర్వలోకేడ్యుఁడై సర్వపూజ్యుండవై యుంటి వో దేవ! రాఁబోవు బ్రహ్మత్వముం బొంది

సృష్టిం బొనర్పంగ నుం టీవు సాక్షాన్మహేశుండ వీకొండపై నుండి భక్తావళిం బ్రోచుచున్ బాపముల్ వాపుచున్ వేరికే నాపదల్ మాపుచున్ రూపు దీపింపగాఁ జేయు దే రాజచంద్రుం డనై యుండియున్ రాజ్యమున్ బాసి సర్వంబునున్ రోసి యీ కొండపై నిన్ను సేవించుచున్ నిన్నుఁ గీర్తించుచు న్నిన్ను ధ్యానించు చుంటిన్ హనూమన్మహానామ! నాపైఁ గృపాలేశమున్ జేసి నాకష్టముల్ దీర్చి కాపాడవే నన్ను సేవింతు ని న్నో మహాదేవ! దివ్యప్రభావా! నమ స్తే నమ స్తే నమః 66

అని ప్రార్థించినం బ్రసన్నుండై ప్రసన్నాంజనేయుండు నీవు నా కత్యంతభక్తుండవు నామంత్రజపంబునం జేసి చరితార్థుండ వైతి వీ వింతలోనన సకలైశ్వర్యంబులం బొందఁ గల వని వరం బనుగ్రహించి యంతర్ధానంబు నొందె నంతఁ గొంతలోన. 67

క. తనరాజ్యంబుననుండిమంత్రివరులున్ దాయాదులున్ భృత్యులున్
జనసంఘంబును గూడి వచ్చి విభు నాశైలంబునం గాంచి యో
జననాథాగ్రణీ! నీదుశాత్రవులు నిస్సారాత్ములైనోత్కరం
బును దారున్ జెడియుండి రిట్టితఱి గెల్పుంబొందసాధ్యం బగున్.

చ. నిను వని బ్రేమఁ జూచినవనేచరు లెల్లరు ధర్మమూర్తినై
మనియెడునీకు వెండియును మాన్మితలరాజ్యముఁ గట్ట నెంచి మిం
చినతమి వేలసంఖ్య కయి చేరిరి నీదగుసైన్యరాజిలో
జనవర! లెమ్ము ర మ్మరులఁ జక్కడపంగను రాజ్యమొందఁగన్.

వ. అనినంత హనూమంతుం డట్లు చేయు మని పలికిన ట్లయిన నతండు తదాజ్ఞ వడసి స్వజనపరివృతుండై నిజరాజధానికిం జని శత్రుసంహారంబు గావించి వెండియుఁ బట్టభద్రుండై రాజ్యం బేలుచుఁ బెద్దకాలంబు మని పుత్రులపై రాజ్యభారంబు వెట్టి యవల గపిరగిరిక్షేత్రంబునకుం జని రాజర్షియై తపించుచు నుత్తమ లోకంబుఁ బొందె నని మఱియునుం జెప్పెద వినుండు. 70

## అష్టసిద్ధులు కలిగిన కథ

సీ. మున్ను గోదాతీరమునఁ బరమేష్ఠియన్
బ్రాహ్మణశ్రేష్ఠుఁడు బరఁగుచుండు
వేదశాస్త్రంబులవిధ మెఱింగినవాఁడు
బ్రహ్మవిద్వర్యుఁడు బహుతపస్వి
వానికి వేవురు వరసుతుల్ పుట్టియుఁ
బుట్టినప్పుడె చచ్చి రెట్టు లెట్లొ
దాన నాతఁడు ఖిన్నుఁడై నళినాక్షునిఁ
బ్రార్థించి తదనుగ్రహంబువలన
తే. నడికిఁ గాలము వచ్చినప్పుడు కుమారు
మారసదృశాంగునిం గని మహితలమున
దాత ధనవంతుఁ డుత్తముఁ డాతతప్ర
భావుఁడును బ్రహ్మవేత్తయై ప్రతిభ గాంచె. 71

వ. అంత నతని కుమారుండు దైవానుగ్రహంబునం జేసి క్రమక్రమాభివృద్ధిం గాంచి వేదశాస్త్రాది విద్యల సంగ్రహించి మహాకవియై గృహస్థుండై. 72

సీ. ధనలోపమైనను దను నమ్ముకొనుటకుఁ
దలపోయఁ డెటువంటితరుణములను
బలికి బొంక యెఱుంగఁ డలుక సేయుం గాని
పరహానిఁ జెప్పఁడు పాలుపడఁడు
తన్ను రక్షించెడుదాత యైనను మాట
లందుఁ దబ్బిబ్బైన నతని విడుచు
తనది కానిది దారిఁ గనఁబడెనే నది
చేముట్టఁ జూడంగఁ జిత్త మిడఁడు.
తే. పిలిచినంగాని పలుకఁడు పెరల తోడ
గరువ మందురు కొంద ఱక్కఱణిగాడు

మూలఁ డైనను వానికై జాలిపడును
చేతనగునుపకారము చేయ నెంచు. 73

సీ. అతఁడు లేచినదాది యణిమాదిసిద్ధులు
తల్లక్షణంబులు తలఁచుచుండు
నంతతోఁ బోవక యవి యెట్టులై వేరి
నెట్లు చేసెనో యెంచుచుండు
కను మూసికొని తాను ఘనుల మునీంద్రులఁ
గని వరంబులు గొన్న కరణిఁ దలఁచు
తా నణిమాదులు తగఁగొన్నవాఁ డయి
యన్నిచోటులు మెట్టినట్టు లెంచు
తే. బ్రహ్మవిష్ణ్వాదిలోకముల్ భక్తిఁ జేసి
తిరిగి తత్తద్విశేషముల్ దెలిసినట్లు
సంచరించును స్వప్నసంచలనమందుఁ
గాక జాగ్రదవస్థయందే కనుఁగొన. 74

వ. మఱియు నిత్యాదు లపూర్వంబు లమానుషంబు లత్యద్భుతంబు-
లనన్యసాధ్యంబు లగునెన్నో కనకగర్భుండు తాను లోనం దలం
చుచుండు నిట్టిసమయంబున నొక్కనాఁడు. 75

తరళ. ఒకమునీంద్రుఁడు వచ్చి వాకిట నుండి భైక్ష్యము వేఁడఁగా
నొకరుఁ డింటను బల్కకుండిన నో యటంచును బల్కుచున్
సుకలఁ డాకనకాత్తగర్భుఁడు చూచి యోగిని దేవ! మి
మ్మొక్కదినంబున మున్ను గన్గొని యుంటిఁ గాదె వనంబునన్ 76

వ. విజయంచేయుం డని లోనికిం దెచ్చి యర్ఘ్యపాద్యంబు లిచ్చి
సుఖాసనాసీనుం గావించి కుశలప్రశ్నంబు సేయుచున్నప్పు
డాయోగి మనకనకగర్భునిదిక్కు మొగంబై. 77

శా. నాతోఁ జెప్పుచునుందు వప్పుడపు డో నాయన్న! నీచిత్తమం
దాతత్త్వార్థము లట్టిరీతిని గడున్ వ్యాయామముం జేయ నే
నీతోఁ జెప్పఁగ వచ్చినాఁడ నిపుడే నీకోర్కి సిద్ధింపఁగా
నాతండ్రీ! మును నీవు యోగివగుచుం దళ్కొత్తియుం దత్తఱిన్,

క. అణిమాదిసిద్ధు లన్నియు
గణియింపఁగ నీకుఁ గలవు కాకుండినచో
క్షణము క్షణాంబుం దత్పరి
గణనము నీ కేల యిట్లు గలుగుం జెపుమా. 79

వ. నీసిద్ధులు నీ కుత్తరజన్మంబున సంప్రాప్తంబు లగు నని చెప్పిన నీవు దానికి సమ్మతింప వని నే నెఱుంగుదుం గావున నేఁ జెప్పిన చొప్పునం జేయుము నీమనోరథసిద్ధి యగు ననిన హిరణ్యగర్భుం డమందానందకందళితహృదయారవిందుండై. 80

ఆ. మ్రొక్కుచుంటి దేవ! దిక్కు నా కీవె తి
నామనోరథంబు భూమి నెవఁడు
సఫల మగు తెఱంగు సలుపంగఁ జాలఁడు
దైవ మీవు తక్క తాపసేంద్ర. 81

ఉ. నావుడు యోగి యి ట్లనియె నాయన! చెప్పెద నాలకింపు మీ
భూవలయంబునం గపిరభూధర మొండగు దానిచెంగటన్
బావనకాపిలానదియు భాసిలు నక్కడ నంజనీసుతుం
డావృతదేశభాగుఁడు మహామహుఁడై విలసిల్లు వింటివే. 82

క. మన మచటి కేగి వత్సర
మనిశము విడకుండ మారుతాత్మజుసేవం
బొనరింతు మేని కరుణా
మనస్కుఁడు మనోరథములు మానక తీర్చున్. 83

వ. అనిపంత నతం డతండును గూచి కపిరాజక్షేత్రంబునకుం జని శర
లానది జలంబాడి హనుమత్కుండంబుకడ బద్ధపద్మాసనుండై తపంబు
సేయం దొడంగి రప్పు డప్పరమయోగి కమారా! నీవు శివపంచా
పాసనంజేసి యున్నవాఁడవు గాని ప్రసన్నాంజనేయుం బ్రస్తు
తించి యెఱుంగవు. నీకు నే నిదే ప్రసన్నాంజనేయమంత్రం
బుపదేశింతు దీని నీ వొక్కసంవత్సరంబు నియమవ్రతంబున
జపింతువేని నీకు నంజనీనందనుండు ప్రత్యక్షుండై మహానందంబు
గూర్పఁ గలం డని యుపదేశంబు చేసి తద్విధానం బంతయు
యథాక్రమంబున నెఱింగించి వానియనుమతిం బడసి తాను దన
దేశంబునకుం జనియె నిక్కడ కనకగర్భుండును. 84

ఉ. యోగి వచించినట్టు లట యోగము పూని యతవ్రతంబునన్
భాగవతోత్తరుం డగుచు బాహ్యతపం బొనరించె వత్సరం
బాగతిఁ దన్నుఁ గొల్చెడుబుధాగ్రణికిన్ దయతోఁ బ్రసన్నుఁడై
రాగము రాగ వాయుసుతరత్నము పొల్చె సమీపభూస్థలిన్. 85

ఆ. చెంతఁ బిలిచి యిట్లు చెలిమి నో ద్విజరత్న
నీకు మెచ్చినాఁడ నీమనోర
థమ్ముఁ దీర్ప నెంచి దండ కేట్లరుదెంచి
నాఁడ గోరుకొమ్ము వేఁడుక మెయి. 86

వ. అనిన నతండు లేచి సాష్టాంగవందనం బాచరించి వినయవినమిత
గాత్రుండై తనకు విజ్ఞానంబుకలిగినది మొదలు తనలోనం గలిగి
దినదినంబునుం దన్నుఁ దపింపఁ జేయుకోర్కె లన్నియుం జెప్పు
టయు నాంజనేయుండును. 87

ఉ. క్రిందటిజన్మమందుఁ దలక్రిందు తపించెడు సిద్ధయోగి వీ
విందుఁ దపోవిఘాతమున నిట్టులు పుట్టితి తొంటితెల్వి నీ

జెండమునం దొకింత యగు జెప్పరమై విను దాన నెప్పుడున్
గొండల నుండుచుండెదవు కోరిక తీరనిదాన లోమదిన్. 88

ఆ. అనుభవించి చూచి నట్లు పుట్టువు చావు
నీకుఁ దెలియు శిశువవై కనుగొని
నవి వచింతు విప్రుడు నవముగా దణిమాది
సిద్ధులందు కోర్కె సిద్ధ మదియు. 89

వ. అని యణిమాదిసిద్ధులును తత్తల్లక్షణంబులు నెఱింగించి నీవు పీనితోడం గూడి మఱికొంతకాలంబు భూమండలంబున మండలాధిపతివై యుండి తొంటియట్లు మునివై పరంధామంబు నొందఁ గలవని యనుగ్రహించి యంతర్ధానంబునొందె నంత హిరణ్యాగర్భుండును. 90

సీ. దూరదృష్టిం జేసి వార కీసర్వప్ర
పంచమున్ గనుగొన్నవాఁడ యగుచు
దూరశ్రవణశక్తి దూరదూరమునందు
వర్తించువాక్యముల్ వరుస వినుచు
శీఘ్రగమనశక్తి చెంత కేగినయట్లు
కనుమూసినంతనే కదలి చనుచు
మానవసాధ్యముల్ కానికార్యము లెల్ల
గడియలో నెరవేర్పఁ గలిగికొనుచుఁ

తే. చావు లేకుండఁ జేసికోఁ జాలుశక్తి
స్వర్ణమును జేయుశక్తియు చచ్చినట్టి
వారి బ్రదికించుశక్తియుఁ మారణాస్త్ర
బాధలేకుండుశక్తియుఁ బడసె నతఁడు. 91

మ. అణుసంకల్పితశస్త్రమే సకల కత్యాగసన్నముం జేసియున్
దృణ మస్త్రై రజమై పటుం బ్రమటిక ఖుంఠేకాక నేయస్త్రమే
క్షణకాలమ్మున శక్తిదూలి వితమై సాల్యక్తమై పోవుఃబ్రా
గణుతింపంగఁ గృపీటయోనివలె నై కారింపఁజాల్ శత్రులన్. 92

ఆ. అతఁడు కొంతసైన్య మప్పుడు సంతనచేసి
సర్వజగతి గెల్చి జనులు మెచ్చ
రాజ్యపీఠ మెక్కి పూజ్యపాదుం డయి
యెల్లప్రజల నేలె నెల్లనాఁడు. 93

క. మనుధర్మశాస్త్రపద్ధతి
కని భిన్నము గాఁగ నెవఁడు కిర్రించి చరిం
చునొ వాని శిక్ష కర్హునిఁ
గ నొనర్చుం దొంటిరాజకౌశికులబలెన్. 94

మ. ప్రతిదేశంబున వేదశాస్త్రముఖదివ్యత్వాతశాలల్ మహో
న్నతనైద్యావృతశాలలున్ విమలగాంధర్వాదిశాలల్ మహా
ప్రతిభన్ జెల్లఁగఁ జేసి సర్వజనులున్ బ్రాంచత్సుఖప్రస్థితుల్
ప్రతిపాదిల్ల నెసంగఁ జేసె ధరణీపాలుం డతం డాఢ్యుఁడై. 95

ఆ. ఆతఁ డేలునప్పు డీతిబాధలు లేవు
లేవు దుర్మరణము లే వలనను
ప్రజలు సర్వసౌఖ్య భరితులై మనుగడఁ
దీర్చు చుండి రపుడు దివ్యులట్లు. 96

ఆశ్వాసాంతము.

క. అని శౌనకాదిమునులకు
వినిపించెను సూతుఁ డిట్లు వేడుకతో డన్
జనులార! దీని వ్రాసిన
వినినం జదివినను సకలవిధశుభము లగున్. 97

## మాలినీవృత్తము.

మం॥ జయతు సుకృతవాదా ఋగ్యజుస్సామవేదా:
జయతు జితభవాఘ స్సర్వగోత్రామరౌఘః
జయతు కృతిపవిత్రా హిందుదేశాత్తగోత్రా
జయతు సుగుణవర్తి కావ్యకృచ్చక్రవర్తీ. 98

## ఆశ్వాసాంతము.

### గద్యము.

ఇది శ్రీమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ,
ఆంధ్రవ్యాస, అభినవశ్రీనాథ, వేదవిద్యావిశారద, ప్రసన్న
వాల్మీకి, విశ్వకవి, కవిబ్రహ్మ, శ్రీపాద కృష్ణమూర్తి
శాస్త్రి ప్రణీతంబైన ప్రసన్నాంజనేయప్రభావం
బను మహాప్రబంధంబున సర్వంబును
చతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ